బడకముందు మధ్యమధ్య (వాటాలకు చెల్లింప నగు) డివిడెండు సొమ్ము చెల్లించుటకు పేరు

**ఇంటెస్టెసీ** — వాణిజ్యన్యాయ పరిభాషా పదము Intestacy ఆస్తికలవాడు తనఆస్తిం గూర్చి ఎవిధమైన విల్లు (ఉద్దేశ పత్రము) వ్రాయకుండ చనిపోయిన స్థితి

**ఇంట్లో తింటూ ఇంటివాసములు లెక్కపెట్టుట** — కృతఘ్నుడని భావము ఆంధ్ర లోకోక్తి

**ఇండక్టివ్ మెథడ్** — (Inductive Method) హేతో దేశాను మానము

**ఇండస్ట్రియాలిజమ్** — (Industrialism) పరిశ్రమల (Industry) వలన దేశధనము అభివృద్ధి కాగలదనియు కాన industry బల పర్చవలయుననియు నమ్మెడివారి మతము

**ఇండియమ్ లోహము** — అపురూపమైనది తెల్లగను మెత్తగను ఉండు లోహము దీని కెమికల్ సింబల్ In atomic weight 114 8 atomic number 49 specific gravity 7 42 melting point సెంటిగ్రేడు థర్మామీటరు 176 డిగ్రీలు వేడికని చెప్పబడి ది తగరముకన్న మెత్తని లోహము వాతావరణశక్తి చేతకనిుచి, ఎడిరి చగల లోహము

సిలేసియా లోని ఫ్రీబర్గుపట్టణముకడనున్న గనులలో ఉండు జింకుబ్లేండు యందు కొలుత క్రీ శ 1863 సంవత్సరమున కనిపెట్టబడినది కని పెట్టిన పరిశీలకులు Reich and Richter అను రసాయనశాస్త్రవిదులు

**ఇండియాదేశము** — తొల్లింటి భరతవర్షము, లేక భరతవర్ష దేశము రానురాను భరత దేశమని బరగుచుండెడిని. ఇం దనేక దేశములు అనేకులగు రాజులచే పరిపాలింపబడు చుండెను (తొల్లింటి రాజ్యములు చూడుడు). వారినుండి మహమ్మదీయుల హస్తగతమై, వారినుండి వేఱ్వేఱు ఐరోపాదేశస్థుల పాల బడి ఎట్టకేలకు బ్రిటీషుప్రభుత్వమునకుం జెరియున్నది ఈ మధ్యకాలములం మహమ్మదీయులనాడు ఉత్తరభాగమునకు హిందూస్థాన మని పేరుకలిగి అది సర్వతా వ్యాపించి దేశమునంతను హిందూ దేశమని విదేశస్థులు వాడసాగిరట దాని నాంగ్లేయులు ఇండియా యని చెప్ప మొదలిడిరి నేటికిని అదియె వాడుకయు డిన్ది దీని కుత్తరమున ముఖ్యమైన ఎల్ల హిమవన్నగశక్తి, క్రిదిమారాబదెసెలంగు సముద్రమే తూర్పుసముద్రమునకు బంగాళాఖాతమనియు (తొల్లింటి రత్నాకరము) దక్షిణదిశనున్నది మహోదధి (దీనిని ప్రాగు హిందూమహాసముద్ర మనుచున్నారు), పశ్చిమమునున్న పశ్చిమసముద్రమున కరేబియా సముద్ర మని ఆంగ్లేయులచే పేరిడంబడినది

ఇండియాదేశము వైశాల్యము పదునేనులక్షల చతురపుమైళ్లని రుంగరు ఇప్పుడు బ్రిటీషు పరిపాలనక్రింద సామ్రాజ్యమై యున్నది ఇంగ్లాండుభూపతి ఇండియాచక్రవర్తి యనంబడు చున్నాడు ప్రపంచమున నిండియాదేశము ఎక్కువ పెద్దది యగు ద్వీపకల్ప మని చెప్పబడు చున్నది పెద్దదేశమగుటయు, అనేక దేశములింగ చేరియుటయు గొప్ప పర్వతపఙ్క్తులు, నగలు వేఱ్వేఱు శీతోష్ణస్థితులం గల్గియుంట భూగోళశాస్త్రజ్ఞు లచ్చెరువాది దీని నొక ఖండముగా జెప్పనగునని వచించియున్నారు ఈమహా సామ్రాజ్యచరిత్ర వ్రాయబడలేదు ఉన్నచరిత్ర పురాణములందు చెప్పబడినది

మూడువైపుల నిండియాదేశము జుట్టిన సముద్రతీర మింతయునిండ నాల్గువేలమైళ్ళు పొడవుండును కాని భూమిలోనికిం జొచ్చుకొనివచ్చి

భాగమోడలకు పూంచి నౌకాశ్రయము నొసంగ తగిన వీలుగలతావు లట్టె కానరావు ఇట్టివి పశ్చిమమున కాంబే సంయుక్తాగ్రగుడము, కచ్ఛి సంయుక్తాగ్రగుడము, దక్షిణముగ మన్నారుసం యుక్తాగగుడము, పాంబన్జలసంధి, పాక్సుజలసం ధియు నై యున్నవి బొంబై రేవు పశ్చిమమున చక్కని రేవుగ నేర్పడియున్నది తూర్పు చెన్న పురికి అట్టి నైసర్గికమైన సహుపాయము లేకు న్నను కృతకముగ నొక నౌకాశ్రయ మేర్పరుప బడినది విశాఖపట్టణపురేవు భూమిలోన నొక త పరం ద్రవ్యవ్యైచి నిర్మించియున్నారు చెన్న పురివైపు తూర్పుతీరమునకు కోరమ డలతీర మనియు, నైఋతిదిశకు మలబారుతీర మనియు పేరిడంబడినది ఇంకను కొన్ని సముద్రతీరపు పట్టణములకడ ఓడలరాపు ఏర్పాటు లేర్పరుప బడియున్నవి

దక్షిణపుదిశను కన్యాకుమారి అగ్రము మళ యాళభూమియగు తిరువాన్కూరురాజ్యమున గలదు ఇట నొక సుప్రసిద్ధదేవస్థానము కన్యా కుమారీదేవిది కలదు సింధుదేశమున మోంజి అగ్రమును (పశ్చిమాగ్రము) డియూ అగ్రము కతియవాడద్వీపకల్పమునకు దక్షిణమునన్నది. సింహళద్వీపమున కుత్తరకోన కెదురుగ కలిమెరి యగ్రమును, మహానదిముఖద్వారమున కుత్తర ముగ పాల్మైరా అగ్రమును కలవు

పర్వతపఙ్క్తులలో హిమాలయమగ్రగణ్యము ఇది ప్రపంచమంతటిలో నెత్తైన పర్వతస్థలి దీని యం దెత్తైన గౌరీశంకరశిఖరము (ఇప్పటి ఎవరెస్టు శిఖరము) ౨౯,౦౦౨ అడుగుల ఎత్తుగలది దీనిని అచటివారు దియోధుంగయనియు ననుచుందురు నేపాలదేశమునకుం బశ్చిమపార్శ్వన కాంచనగంగ (ఇప్పటి కించింజంగ) శిఖరమును కలదు ఇం కను ధవళగిరి, కైలాసశిఖరము మొదలగు శిఖ రము లనేకము లీ హిమవన్నగమున చెప్పందగినవి కలవు. దీనియొక్క శాఖయగుగరళ పర్వతమున గరళశిఖరము, మాంధాతశిఖరము సుప్రసిద్ధ ములు మాంధాతశిఖరముకడ నొక గుహ గలదు సుప్రసిద్ధుడై కృతయుగాన కారభూతుం డై బరగిన మాంధాతచక్రవర్తి తపము బొనర్చి యోగనిష్ఠచేత భౌతికశరీరమును వీడి పవిత్ర స్థలియగు నే ఈకని ఆయార్యస్త్రులు పూజింప బడుచున్నవి హిమవన్నగము ౧,౫౦౦ మైళ్ల పొడవును, అనేక తావుల రెక్కు వతక్కువలతో ౨౦౦ మైళ్ల వెడలుపును కలదిగ జెప్పంబడినది హిమవన్నగముకు దక్షిణమువైపుగగల పర్వత ములలో నాదినున్న పఙ్క్తి శివాలికపర్వతములకు (తొల్లింటి సవాలాఖ్యాంబును సపాదలక్షపర్వతము) లక్షాయిరువదియైదువేల శిఖరములుంట నా పేరు గల్గినది ఇందడవిమృగములు గల అరణ్యములు కలవు హిమవన్నగపాదభూమికి తరై యని పేరు కల ఇది చాలా చెమ్మనేలయు, అనారోగ్య ప్రదేశమునై యున్నది దీనియందిటీవల తోటల నాటియు, వ్యవసాయముల కనుకూలముగ జేసియు బాగుచేయుచున్నారు.

అఫ్ఘనుస్థానమునకు, ఇండియా దేశమునకు నడిమనున్న పర్వత పఙ్క్తికి సులైమాన్ పర్వ తములనిపేరు గీనియం దెత్తైన శిఖరము తక్తి సులైమాన సోలోమోన్సింహాసనమని యర్థము ఇది ౧౧,౩౧౭ అడుగుల ఎత్తుకలది బెలూచి స్థానమునకును ఇండియాకును నడుమ హాలా పర్వత పఙ్క్తి కలదు గంగానది, సింధునది ప్రవాహ ప్రదేశముల నడుమ ఆరావళి (తొల్లింటి ఆదర్శావళి) పర్వత పంక్తి కల దిది ౩,౬౦౦ అడుగుల ఎత్తుకలదని చెప్పంబడినది దీనియం దెత్తైన శిఖరము ఆబు (తొల్లింటి అర్బుదము) శిఖ రము ఇది సముద్రపు నీటిమట్టముపై ౫,౬౫౦

అడుగుల ఎత్తుకలిగియున్నది. దేశమునకు సుమారుగా తూర్పు పడమరలకు వింధ్య పర్వత పంక్తి వ్యాపించి యున్నది. ఇది దక్షిణ హిందుస్థానపు (ఇప్పటి డక్కన్) పీఠభూమికిని ఉత్తరపు హద్దుగ కాంబే సముద్రాగ్రగుడము నుండియు గలదు. దీనిశాఖలలో కొంకటియను మేఖల పర్వతమున జనించి అరేబియా సముద్రము సంగమించు నర్మదా (రేవానది) నది రేవ కు ఉత్తరపు ఎల్లగానున్నది. దీనియొక్క శాఖయొకటు సైతము పర్వత పంక్తి తూర్పుగానున్నది. తపతీ నర్మదా నదుల మధ్యగా పర్వత పంక్తికి సాత్పుర (సప్తపుర) పర్వతమనియు తపతీ దక్షిణభాగమున గల పర్వత పంక్తికి నార్త్ ఘాట్సు (ఉత్తరపర్వత) అనియు నందురు. దీనికి దక్షిణపు నుత్తర పర్వత పంక్తి యనిపేరు. ఇవియన్నియు వింధ్య విభాగములుగనే యున్నవి.

దక్షిణాపథ (డక్కన్) పీఠభూమికి పశ్చిమపు హద్దుగా పశ్చిమ పర్వత పంక్తి కలదు. దీని నిప్పుడు పడమటి కనుమలు (Western Ghats) అనుచున్నారు. ఇది నర్మదాముఖమున కన్యాకుమారి అగ్రము వరకు వ్యాపించియున్న పశ్చిమాచలము ఎత్తు ఇంచుమించు సముద్రపు మట్టముపై 3,000 అడుగులు. ఈపశ్చిమాద్రి పర్వత పంక్తికిని పశ్చిమ సముద్రమునకును నడుమ ముప్పది లేక నలుబది మైళ్ల వెడల్పుగల తీర దేశము కలదు.

ఇట్టులనే దక్షిణాపథ పీఠభూమికి తూర్పు ఎల్లగ పూర్వాచల పర్వత పంక్తి కలదు. దీని నిప్పుడు తూర్పు కనుమలు (Eastern Ghats) అనుచున్నారు. పూర్వాచల మించుమించు రెండు వేల అడుగుల ఎత్తుకలదిగను, అనేకతావుల అనేక నామములు గల్గినదిగను యున్న పర్వత పంక్తి. పూర్వాచల పశ్చిమాచలములు దక్షిణపు కడను కలని పర్వతములందునను కలియుచున్నవి. ఇట్లు దక్షిణాపథము యొక్క మూడుదిశలను పర్వత పంక్తులుగల్గి త్రికోణాకార పీఠభూమిగ నున్నది. ఇది పెద్దదియగు పీఠభూమి. దీనికిం బిదప చెప్పందగినది మాళ్వా (మాళవ) పీఠభూమి. ఇది వింధ్యోత్తర పాదము నంటియేయున్న త్రికోణాకారమున నున్న పీఠభూమి చిన్నది. ఇది గంగానది తట్టు ఏటవాలు కలది. దక్షిణాపథ పీఠభూమి సముద్రపుమట్టముపై నించుమించు రెండు వేలవరకు అడుగుల ఎత్తు గల్గియున్న భూప్రదేశము.

గంగాది ప్రవహించు సమతలము ఉత్తరమున హరిద్వారము మొదలు తూర్పునకును ఇంచుక ఆగ్నేయముగను వ్యాపించి బంగాళాఖాతముకడనున్న గంగానది డెల్టాకడ ముగియుచున్నది. ఇది ప్రపంచమున గల సమతలములలో గొప్పవాటిలో నొక్కటి. మిగుల సారవంతమై ఫలవంతమై బహుజనవంతమైనది. పిదపం జెప్పందగినది సింధునది ప్రవహించు సమతలము. ఇది ఉత్తరమున హిమాలయపర్వత పాదము పారంభమై దక్షిణముగ పశ్చిమ సముద్రము వరకు గలది. ఇది ఉత్తరభాగము నదికి తూర్పుగా నిసుకప్రదేశము కూడ కలదు. దానికి థార్ అనియు ఇండియన్ ఎడారి యనియు వాడుకనామములు కలవు. ఈరెండు సమతలప్రదేశములు పెక్కు చాలదేశమున కలియుచున్నవి. ఇట్లయ్యు నివి అనగాలు ప్రవహించు దిక్కులకు ఏటవాలుం గల్గియున్నవి. ఇంక దక్షిణాపథ పీఠభూమి కిరుదెసలను పూర్వాపశ్చిమ పర్వతపంక్తులకవ్వల సముద్రమువరకు వ్యాపించిన సమతలప్రదేశములు కలవు. అందు పశ్చిమమువైపు సమతలము వెడలుపు తక్కువయయ్యు గొప్ప సారవంతమగు భూమి. తూర్పుదిక్కు సమతలము అధికమైన వెడలుపు కలది.

నదులయందు గంగానది అగ్రగణ్యము. దీని సరియగుపేరు భాగీరథి (గంగానది చూడుము) పవిత్రవంతముగ నెంచంబడుచుండుటయేగాక వ్యవసాయములకు జీవకళకొసంగి ఓడలు నడువదగినదిగ నున్నది. ఇంగిలసుప్రసిద్ధము తరువాతఁ జెప్పఁదగినది బ్రహ్మపుత్రానది. హిమాలయపర్వతపఙ్క్తి కవ్వలంబుట్టి ఒక పొడవైన లోయగుండా సాంపూనది యని పేరంబరగుచు తూర్పుదెసగా ప్రవహించుచు దిహాంగుననదిగ గల్పుకొని ఆసాముదేశము ప్రవేశించుచో పాయలుగ చీలును. పశ్చిమశాఖకు కోనై యనియును, తూర్పుశాఖకు నుగ్గా యనియును, మధ్యశాఖకు బ్రహ్మపుత్ర యనియును నామములంగల్గి, పైశాఖ గంగానదితో కలసి పద్మానది (పుద్దా) యను పేరను, పైశాఖ సురమా నదితో కలసి గంగతోసహా బంగాళాఖాతము నంగముగలుచును. గంగానది పొడవు ౧,౫౬౦ మైళ్లు, బ్రహ్మపుత్రానది ౧,౮౦౦ మైళ్లు పొడవనియు, వెల్లువలకాలము ఎక్కువ అపాయకరముగ నుండునియు ప్రవాహము ఎక్కువ వడి గల్గి యుండునియు చెప్పఁబడెను.

గంగానది గంగోత్రికి చుట్టువ్వల గోముఖ హిమనిలయమున భగీరథాశ్రమస్థానమున జనించుచున్నది. గంగోత్రి సుప్రసిద్ధతీర్థము. ఇట ఊదారంగు బంగారురంగు కమలములు గల సరస్సుగుండా పరియుచుండు. హిందువులకుఁ బవిత్రవంతమగు మహానది దీనిని నిరసించుటయే విధిగా తలంచు క్రైస్తవులుసైతము పరిశీలనల వలన తేలిననిజము నీటియందు క్రిములు ఉండ నేరవను సిద్ధాంతమును కాదనలేక మానముద్రం బూనుదురు. గంగానది కుత్తరమునందు యమునానది, గోగ్రానది, హిమవన్నగము నుండియు వింధ్యనుండి శోణభద్రను, ఇంక నితర తావులనుండి సరయు లేక రామగంగ, గోమతి, గండకీనది, కుశీనదుల నుపనదులుగను, దక్షిణముననుండి టోన్సునది, కర్మనాశ నదుల నుపనదులుగను తనయందు చేర్చుకొనుచున్నది. వింధ్యపర్వతమున జనించు చర్మన్వదీ (ఇప్పటి చంబల్) నదియును, వేత్రవతీ (ఇప్పటి బేత్వా) నదియును యమునానది కుపనదులై యుండుచున్నవి. ఆనోన్నునదికిఁ బూర్వపుఁ పేరు తమసానది.

గంగానదియు, బ్రహ్మపుత్ర శాఖయుంగలసి పద్మా (పుద్దా) నది యైనదని మున్నువివరింపఁబడినది. అది కోనైనదితో గోవాలేండుకడ సంగమమై నడచును. భాగీరథిగంగ యుక్క దిగువభాగమున త్రివేణియను గ్రామమున గంగ మూడుగ చీలును. దీనిని ముక్తవేణియని యందురు. అలహాబాదు నగరమందున్న ప్రయాగ (ఇప్పటి దారాగంజి) కడ త్రివేణి యుక్తవేణి యనియు, ఇట సరస్వతీనది యంతర్వాహినియై గంగయందుఁ జేరునియుఁ జెప్పఁబడినది. కలకత్తా ప్రక్కనుబడి ప్రవహించు గంగానది శాఖకు హుగ్లీ యనిపేరు. ఇది బంగాళములోని హుగ్లీ పట్టణమునంటి ప్రవహించుట నీపేరు వాడుకయైనదిగాని పూర్వపుపేరు తెలియుటలేదు. గంగా బ్రహ్మపుత్రలు చేర్చిన గొప్ప డెల్టా ప్రపంచములో పెద్ద డెల్టా యని చెప్పఁబడినది. దానికవ్వలనున్న చిన్నచిన్న లెక్కలేని దరిదరినే కనుసమీపమునందున్న దీవులన్నియుంగలసి సుందరవనము (Sunderbuns) అనంబడుచు అనారోగ్య ప్రదేశముగను, పులులకు మొసళ్ళకు నునికిపట్టుగను, వేటలతావుగను ఉన్నది.

పిదపఁ జెప్పఁదగినది సింధునది. ఇది ఇండియాలో పెద్దనది. ౧,౮౦౦ మైళ్ల పొడవుగలది. టిబెట్టుదేశమునందలి హిమవన్నగ కైలాసశిఖర పశ్చిమదిశను రావణహ్రద (రఖస్తల్) సరస్సున కవ్వలి కొండసేలల నీటియూటలందు జనించి,

పశ్చిమవాహినియై నడచును శతద్రు (ఇప్పటి సట్లెజి) నదియు ఈ కొలనే జన్మించునది కాశ్మీర దేశముజొచ్చి దక్షిణవాహినియై యనేక చిన్న ప్రవాహములం గల్పుకొని బలపడి పాంచాల దేశముంజొచ్చి దక్షిణవాహినియై యెనవకులం గల్పుకొని సింధుదేశముగుండా నడచి పశ్చిమ సముద్రమున సంగమించును దీనికి పశ్చిమమున ప్రధానమగు ఉపనది కుభా (ఇప్పటికాబూల్నది) నది యు బయుచున్నది పూర్వమం గలియు నవలు ౧ రవి (ఇప్పటి రావీనది) దీనికి కను వేత్వేయు ౪ నము ౨ ఐరావతి పరూష్ణి హైమవతి యను నామములు వాడంబడినవి ౨ విపాశానది (ఇప్పటి బీయాస్), ౩. అశిక్ని (ఇప్పటి చీనాబునది) ౪ వితస్తానది (ఇప్పటి జీలమ్నది) ౫ శతద్రు (ఇప్పటి సట్లెజి) యను నదు లైదింటిని గల్పుకొనుచు ఈయైదు నొకటి నొకటి సంగమించి యొక ప్రవాహమే సింధునది యొక్క సంగమించు చుదు అద్దానికి పంచనదమని పేరయ్యెను సింధువనిన సముద్రమని యర్థము ఎక్కువ వెడలుపు గలిగియుంట నిపోకియు డి రని తోచెడిని ఇట్టి గభీర నామరూపములం గల్గిన యీనది ఎక్కువ గొప్పదైనదికాదు పురాణ ములదిగి నదమని చెప్పంబడినది

గోదావరి లేక గౌతమీనది నాశికాత్ర్యం బకముకడ జన్మించి, నైజామురాజ్యముగుండా నడచి భద్రాచలము, రాజమహేంద్రవరముల ప్రక్కంబడిజని బంగాళాఖాతమున సంగమించును. దీనికి వరద మంజీర మొదలగు నుపనదులు కొన్నిగలవు. కృష్ణానది వేణీనదితోం గలసి కృష్ణవేణీ లేక కృష్ణానది యనంబరగుచు బెజవాడ ప్రక్కంబడిచని బంగాళాఖాతమున సంగమించును తుంగభద్ర ఉపనదియై దీనియందు కలియును. తుంగానదియు, భద్రానదియుంగలసి తుంగభద్రా నదిగ పేరందినవి కావేరీనది దక్షిణదేశమును ఫలవంతముగం జేయుచున్నది. మహానది మధ్య రాష్ట్రములగుండా ప్రవహించి కటకముం జొచ్చి నడచి, ఛండీబాలేశ్వరముకడ సంగమించును గోదావరి పొడవు ౯౦౦ మైళ్లు కృష్ణానదిపొడవు ౮౦౦ మైళ్లు, కావేరి ౪౭౦ మైళ్లు మహానది పొడవు ౫౨౦ మైళ్ళు

భరతదేశమునవర్ష వాయువులు (Monsoons) రెండుగ నున్నవి నైఋతిదిశనుండి వీచు వర్ష వాతమొకటియు, ఈశాన్యదిశనుండి వీచు వర్ష వాతమొకటియు వర్షములం గురిపించును మే నెల మొదలు సెప్టెంబరునెలకు ఈశాన్యదిగ్వర్ష వాతమును, అక్టోబరుమొదలు మార్చినెలవరకు వాయవ్యదిగ్వర్ష వాతమును వేత్వేఱు తావులందు వర్షముల గురిపించును ఆంధ్రదేశమున రెండును అందు ముఖ్యముగ నిశాన్యదిగ్వాతము వర్షింపం జేయును హిమాలయ దక్షిణపు ఎట వాలు ప్రదేశములందును బ్రహ్మపుత్రానది ప్రవహించు లోవయందును, వర్షమధికము కురియును అచటి కాశీపర్వతములందు, అందు ముఖ్యముగ చిర్రాపుంజి యనుతావున నేటేట ౫౨౩ అంగుళముల వర్షము గురియును ఇది ప్రపంచమున నెక్కువ వర్షము కురియు తావని చెప్పంబడి ది ఇత్తావు అసాముదేశములోనిది పశ్చిమసముద్ర తీరమున వర్షమధికము. అందు మహాబలేశ్వరపు కొండలందు ౨౮౦ అంగుళముల వర్షము కురియును తూర్పుకనుమల కవ్వలి సముద్రతీర ప్రదేశములందు వర్షము తక్కువగా కురియును ఆదర్శావళి (ఆరావళి) పర్వతపశ్చిమ భాగమున వర్షము బొత్తిగా తక్కువకురియును. దక్షిణాపథ తూర్పుతీరప్రాంతమున ఈశాన్య దిగ్వాతవర్షములును, పశ్చిమతీరముల నైఋతి నైఋతిదిగ్వాత వర్షములును ముఖ్యములు. బొంబై ప్రాంతముల నేటేట ౭౦ అంగుళములును, కలకత్తాయందు ౬౬ అంగుళములును, చెన్నపురి

ప్రాంతమున ౧౦ అంగుళములును, ఢిల్లీప్రాంతముల ౨౫ అంగుళములును సింధుదేశోత్తరభాగమున రెండంగుళములును, ఏటేట వర్షించుచున్నదని లెక్కింపబడినది. శీతోష్ణస్థితియు వర్షములం బట్టి చాలవరకుండునుగదా. బంగారు, వెండి, రాగి, తగరము, సీసము, తుత్తినాగము, రత్నములు, రాక్షసబొగ్గు, కలవు. దేశమున కలవు. సముద్రతీరములందు సముద్రలవణమును చేయుచున్నారు. హిందూస్థానపు భాగములందు సైంధవలవణము వాడుచున్నారు. రాజపుత్రస్థానములోని సాంబారు (ఉప్పునీటి) సరస్సునుండి సముద్రపునీటిను వలెనే ఉప్పును జేయుచున్నారు. దీనికి సౌవర్చలవణమని పేరు. సింధుదేశపు గనులందు దొరకునదే సైంధవలవణ మనబడును. భరతదేశపు భూముల దన్నిటాపులందు నుదకస్వాస్థ్యము మూడనేని అన్ని పంటలు పండుచున్నవి. వర్షానుకూలము లేనప్పుడు కాల్వలగుండ నదీజలములఁ బ్రవహింపఁజేసిగాని భూములను ఫలవంతముగఁ జేయు ప్రయత్నములు చేయబడుచున్నవి. ఇంకను పంటచెర్వులందు నీటినినింపి పొలములకుపయోగించుటయుంగలదు.

దేశమున వంశపరంపరలనేక జాతులవారు కలరు. అనేకభాషలను మాట్లాడువారు అనేక మతములవారు గలరు. జాతులందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతులును భాషలందు హిందీ, ఉరుదు, ఆంగ్లము, తెలుఁగు, అరవము, బర్మా భాషలును, మతములందు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, మతములు, వాని అంతర్భేదములును వ్యాపించియున్నవి. బాటలు, ఇరుకుబాటలు బాగుగనే యున్నవి. దేశము బ్రిటీషుప్రభుత్వ పరిపాలనయందున్నది.

రాజకీయముగ పరిపాలన విధానమునుండి ఇప్పటి ఇండియాదేశమును ౧ బ్రిటీషు ఇండియా యనియు, ౨ ఫ్యూడేటరీ ఇండియా యనియు, ౩ ఇండిపెండెంటు ఇండియా యనియు, ౪ ఫ్రెంచి ఇండియా యనియు ౫ పోర్చుగీసు ఇండియా యనియు నైదుగా చెప్పవచ్చియున్నారు. బ్రిటీషు ఇండియా యన చక్రవర్తిగారి రాజప్రతినిధియగు వైస్రాయి ద్వారా పరిపాలింపబడుచున్న దేశభాగము. ౨ ఫ్యూడేటరీ ఇండియా యన బ్రిటీషు ప్రభుత్వమువారి వైస్రాయి ఇండియాప్రభుత్వపు రక్షణక్రింద స్వదేశీ భూపతులచే పరిపాలింపబడుచున్న స్వదేశ రాజ్యములు. ఇవి హైదరాబాదు రాజ్యము, మైసూరు రాజ్యము, కాశ్మీరరాజ్యము మొదలగు రక్షిత సంస్థానరాజ్యములు. ఇవి దేశమున పెక్కులు గలవు. కొన్ని వైస్రాయి క్రిందను కొన్ని గవర్నరులక్రిందను ఉన్నవి. ౩ ఇండిపెండెంటు ఇండియా యన నేపాళరాజ్యము భూటాను రాజ్యము వంటి స్వతంత్ర రాజ్యములు. రెండును ఇవి రక్షిత సంస్థానములుకాక స్వతంత్రరాజ్యములై యున్నవి. ౪ ఫ్రెంచిఇండియా యనఁ పుదుచ్చేరి ప్రోవిన్సు యానాము, కారికాలు, చందనాగోరు మాహె లైయున్నవి. ౫ పోర్చుగీసు ఇండియా యన గోవా ప్రోవిన్సు (డామన్ ద్వీపముసహా) డయ్యూ, డామనులై యున్నవి. వీటిని గూర్చి ఆయాశీర్షికలఁ గననగును. (భరతదేశము చూడుఁడు)

**ఇండివిడ్యుయలిజమ్** — (Individualism) కేవల సాంఘికములుగఁ గాకుండ ప్రత్యేక ప్రత్యేకముగ ప్రతి మనుష్యునకు కర్మ స్వాతంత్ర్యము మనటుల ధర్మము, సమ్మతము. ఇది రాజకీయ మతము.

**ఇండుప (కాయలు లేక గింజలు) చెట్టు** — లా. **Strychnos potatorum** ఆంగ్ల. **Clearing-nut tree** సం. **అంబుప్రసాద, కతక.**

దీని కాయలలోని గింజలను ఇండుపకాయ లనియు ఇండుపపిక్కలనియు చిల్లగింజ లనియు కూడ వాడుచున్నారు. అరగదీసిన గంధము జిగటగ నుండును. నీటిని దలి ఖురదనుగట చేయును. మేహశాంతి వీర్యపుష్టి యను కల్లు తొలువు రోగమును అగ్నిమాంద్యము గ్రహణి మూత్రకృచ్ఛ్రము లను నివారించును. పాలతో గన్ని తినుచు డిన ఇంద్రియ నష్టమును మాన్పును. కాయల కూరను కొందలు తినదరని తెలియుచు ది. ఆది కఫత్వము రక్తపైత్యము క్షయ నేత్రరోగములు మేహము ఏమేహము విష దోషములు హరించును. విరేచనబద్ధము చేయును. ముదిరి కాయల చూర్ణము కవము ము గ్ర చగర్ణము గలద.

**ఇండెంటు** — వాణిజ్యసంబంధ పరిభాషా పదము. Indent దీని order అనియు నందరు. ముఖ్యముగ విదేశ వర్తకులు తమ నిలిత్తము వలయు రకులగొని పంపుమని తమకోల్లతో ధరలతో లుపు తమను ఇచ్చుటయు దేశములో డచు వానికి అగరనియు వాడుచునారు.

**ఇండెక్సు నెంబర్సు** — (Index Numbers) వాణిజ్య సంబంధ పరిభాషా పదము.

ఈ ఇండెక్సు నెంబరును ఒక దేశము కి సంవత్సరమున ధర ప్రమాణము (Pr ce Level) ను తెలుపుటకు ఉపయోగింతురు. ఈ అంకెలను ప్రతివత్సరమును లెక్కగట్టుదురు. ఈ లెక్కలను బట్టి వెనుకటి సంవత్సరముకంటె వస్తువులధరలు పెరిగినదియు తరిగినదియు గ్రహింపనగును. ఈ ధరలను బట్టి వర్తకము నడచుచుండును. వెనుకటి సంవత్సరపు ధర నూరు (౧౦౦) అనుకొని ఇప్పటి ధర నూటికింత పెరిగినదియు, లేక తరిగి నదియు జెప్పుదురు. ఇప్పుడివ్వాను ఏని యుపయోగము ఎక్కువగ గల్గుచున్నది.

ఈ నెంబరును గనుగొను మార్గములు నాలుగు. ౧ గటు ధర తెలిసికొనుట (S mple Average) అన్ని వస్తువుల ధరలను వరుసగ వేసి కూడగా వచ్చిన మొత్తమును వస్తువుల సంఖ్యచే భాగించగా వచ్చిన అంకె. ౨ ప్రతి ధర యొక్క స్క్వేరు రూటు (Square Root) ను తెలిసికొని వానినుండి సగటు ధర కని పెట్టుట. ౩ ధరలన్నియు నాలుగు పైనను ను డియు క్రమముగా హెచ్చుచు వరుసగ వేసి వానిమధ్యనున్న ధరను దీనిని చో ది గా సగము ధరను చెప్పుదురు. ౪ దీనిని (We ghted Average) అందురు. సామాన్యముగా దీసికొనిన వస్తువులకన్న యోగమున ముఖ్యమైన వస్తువు కొన్నియుండును. ఉదా ఉప్పు వస్త్రములు మొదలగునవి తక్కిన వస్తువుల కన్నను ఎన్నిరెట్లు ముఖ్యమైనదో తెలిసికొని అన్నిసారులా ధరను ట్లిగోర్చిన దంగను సికొనగు. ఈ విధానము తగా వాడుకలో లేదు.

ఈ అంకెలను ప్రభుత్వము యు ప్రకటించుచుండును. ఎకనామిస్టు (Economist) మొదలగు పత్రికలు కూడ ప్రకటించుచుండును. రెండు సంవత్సరముల ధరలను పోల్చిచూచునప్పుడు మొదటి వత్సరమున్న రకముల వస్తువులు తీసి కొనిమొదటి సంవత్సరము కూడ వన్ని టినే అంత పరిమాణముగల వానినే తీసికొని ధరలు నిర్ణయింపవలెను. ఈ అంకెలిట్లు వాడ బడుచున్నను సరియైన ధర ప్రమాణమును తెలుపజాలుట లేదని చాలమంది సందేహించు చున్నారు.

విస్తారము కలది. మూలపురుషుఁడు రైతనియు, క్రీ. శ. ౧౭౦౩ లో జన్మించినవాఁడనియు చెప్పఁబడినది. ఇండోర్పురము రాజధాని (దీని తొల్లింటిపేరు ఇందూరు) దేశమునందు వింధ్య పర్వతములు కలవు (సెంట్రలిండియా ఏజన్సీ సంస్థానములు చూడుఁడు) సుప్రసిద్ధదాత, నిర్మాత యగు అహల్యాబాయి (మహారాజ్ఞి) ఈసంస్థాన రాజ్యమేలిన ధర్మాత్మురాలు.

**ఇంద్రకంటి విశ్వపతిశాస్త్రి** — కవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. బ్రాహ్మణుఁడు. తెలఁగాణ్యశాఖ. రచించినది నారాయణమానస మను వేదాంతగ్రంథము.

**ఇంద్రకీలాద్రి** — (పర్వతము) బెజవాడ చూడుఁడు.

**ఇంద్రకౌశికగణము** — ఇది విశ్వామిత్ర సంతతిలోని గణము. ఇందు గోత్రములు మూఁడు కలవు. ౧ ఇంద్రకౌశిక, ౨ కౌశిక, ౩ ఇంద్ర అనునవి. వీనికిప్రవర విశ్వామిత్ర, ఇంద్ర, కౌశిక.

**ఇంద్రకౌశిక గోత్రము** — ఇంద్రకౌశికగణము చూడుఁడు.

**ఇంద్రగయ** — మధ్యరాష్ట్రములందు జబ్బల్‌పూర్‌నకు దగ్గర నర్మదానదీతీరమునఁ గల మార్బిల్‌రాక్సు అనఁబడు తావునఁ గల స్నానతీర్థము. ఇది ఇంద్రగయ యని చెప్పఁబడుచున్న పిత్రర్చనస్థలము. ఇప్పుడు భేరాఘాటను పేరఁ బరగుచున్నది (గయ చూడుఁడు).

**ఇంద్ర గోత్రము** — ఇంద్రకౌశిక గణము చూడుఁడు.

**ఇంద్రచాపలక్షణపరీక్ష** — కాలవిజ్ఞానశాస్త్రమునందు చెప్పఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.) ఇంద్రచాపమును అరివిల్లు లేక, ఇంద్రధనస్సు నియు గూడ ననుట గలదు. ఇంద్రధనస్సు సర్వసాధారణముగ వర్షయోగచిహ్నముగ తలంపఁబడుచుండును. ఇది యనేకములగు చిత్రవర్ణములతోఁ గూడి యుండును.

౧ పసుపుపచ్చ, ఆకుపచ్చ, నీలము, తెలుపు, ఎఱుపు వర్ణముల నింద్రచాప మగుపడినను, మేఘములం దావర్ణముల జాడలు దోఁచినను చక్కఁగ వర్షించి పంటలు సుభిక్షముగ పండునని యు ౨ వాన కురియుచు మెఱుపులు గల్గియుండుతఱి పగటియం దింద్రధనస్సు తూర్పు నుండి ఉత్తరమునకుఁ గాని, పడమటినుండి దక్షిణమునకుఁ గాని, కన్పించిన సుభిక్షము రానున్న ట్లెఱుఁగవలెననియు, ౩ అధికవర్షము కురియుచుండుతఱి రాత్రియందు ఎఱ్ఱనిరంగుగల మెఱుపు చంద్రునకు, ఇంద్రధనస్సు, గాన్పించిన భూపతులకుఁ గీడనియు, ౪ రాత్రియం దేదిక్కున నింద్రచాపము దోఁచునో ఆదిక్కున ప్రజలకుఁ గీడనియు, ౫ ఇంద్రధనస్సు పచ్చరంగును ప్రధానముగ గల్గియున్నయెడల ప్రజలకుం గీడనియు తెల్లగ నున్నయెడల దేశమునకుం దుర్దశ గల్గుననియు ౬ వర్షము కురియునపుడు సాయంసంధ్యాకాలమున వాయువ్యదిశయందు నగ్నిహోత్రమువలె ఇంద్రచాపము తోఁచుటయు, చంద్రబింబము అగ్నిరంగున నుండుటయు పాలకపాలితుల కిర్వ్వరకు గీడనియు, ౭ జ్యేష్ఠాషాఢశ్రావణమాసములందు పడమటిదిక్కున నింద్రధనస్సు కన్పించిన వర్షము లుండవని యెఱుఁగవలయు ననియు కాలవిజ్ఞానమయుఁడు తెల్పియున్నాఁడు.

**ఇంద్రజిత్తు** — రక్కసుఁడు తండ్రి రావణభూపతి తల్లి మండోదరి. నామధేయము మేఘనాథుఁడు. ఇంద్రు నొకతరి సంగరమున జయించుటంజేసి ఇంద్రజిత్తని ప్రఖ్యాతి కలిగెను. అతి మాయకాఁడు. గొప్ప తపం

బొనర్చి పదునాల్గువత్సరములు నిద్రాహారముల నెఱుంగనివానిచేతంగాని హతుఁడుగాకుండ వర మందినవాఁడు రామాయణ యుద్ధమున శ్రీరామ సోదరుండగు లక్ష్మణునిచే నిహతుడయ్యెను. లక్ష్మణుఁడు నిద్రాహారములు మానినియు, యాతనినిద్ర నాయనధర్మపత్ని (జనకమహారాజు కూతురు) ఊర్మిళాదేవి యనుభవించుచు నౌ ననియుం జెప్పఁబడినది ఇంద్రజిత్తు సింహళము నందలి కుంభిలయనంబడుతావున యాగమొనర్చె నని చూపుచున్నారు (లంకా రాజ్యము చూడుఁడు).

**ఇంద్రద్యుమ్న (సరస్సు) ము** — ఉత్కలదేశమున పూరీ (జగన్నాథము) యందు ఇంద్రద్యుమ్న నగరమునందు జగన్నాథస్వామి విడిదిగృహముకడనున్న యొక సరస్సు ఇది యా మహారాజుచే త్రవ్వింపఁబడినదని తలంపఁబడు చున్నది అతండు దానమొనర్చిన గోవుల త్రొక్కిడిచే నైనదని వ్రాసియున్నారు

**ఇంద్రద్యుమ్నుఁడు** — ఒకమహారాజు ఉత్కలదేశమున, జగన్నాథమున ఇంద్రద్యుమ్న నగరము విడిదిగృహము దేర్పఱచి చిరవాఁడు గొప్ప విష్ణుభక్తుఁడు. మహాదాత. ఇంద్రద్యుమ్నము మాడఁడు తండ్రిపేరు సుమతి పితామహుడు భరతుఁడు ప్రపితామహుఁడు ఋషభుఁడు ఇంద్రద్యుమ్నుఁడు అగస్త్యునిచే శపింపఁబడి గజేంద్రమోక్షణకథయందు గజేంద్రుఁడై, తర్వాతిజన్మమున జని చి విష్ణుదేవునిరక్షణ దెనం నని చెప్పఁబడినది

**ఇంద్రపురము** — సంయుక్తరాష్ట్రముల లోని బులాంద్‌షహార్ జిల్లా అనూపషహార్ భాగములోనిది భాయి అనంబడుతావు వాయువ్య దిశగా నైదుమైళ్ల దూరమున నిప్పుడు ఇందో రనంబడుచున్నది. క్రీ. శ. ౪౬౫ సంవత్సరమున స్కంధగుప్తుని శాసనముల పేర్కొనఁబడినది నందగిరికృత శంకరవిజయమున చెప్పఁబడిన ఇంద్రప్రస్థమనునది ఢిల్లీలోని ఇంద్రప్రస్థమునకు సరిపోవుటలేదు ఈ ఇంద్రపురమునకు సరిపోవు చున్నది కాన ఆనందగిరి పండితుఁడు పొరబడి యుండవలెనని తోచెడిని

**ఇంద్రప్రమద గోత్రము** — వశిష్ఠ గణము చూడుము

**ఇంద్రప్రమితి** — ఋ ౧ వేదవ్యాసుని శిష్యుఁడగు పైలునికి శిష్యుఁడు ఋగ్వేదసంహితను చతుర్విధ మొనర్చెను. పండితుఁడు ఇతని శిష్యులు ౧ భామ్కలుఁడు, ౨ బోధ్యుఁడు, 3 యాజ్ఞవల్క్యుఁడు, ౪ పరాశరుఁడు, ౫ మాండూకేయుఁడు, ౬ అగ్నిమతి యను వారలు

**ఇంద్రప్రస్థ దేశము** (ఢిల్లీసీమ) — ఇంద్రప్రస్థపురమిప్పటి ఢిల్లీయగుట నాప్రాంత దేశమింద్రప్రస్థదేశమనుట తెల్లము కొల్లంటి కాలము నదేశమునకు నిగమబోధ యనియు వాడుకయుండినట్లగపడును తొల్లి యుధిష్ఠిర మహారాజు కాలమున నిగమబోధి ఘట్టమనఁబడిన యమునానదియందలి స్నానముల రేవిప్పటికి నాపేరం బరగుచు సలీమ్‌ఘడ్ కు సమీపము నంగల నిగంబోధి ద్వారమనఁబడు నగరద్వారము కడనున్నది యుధిష్ఠిరప్రతిష్ఠితమగు శివలింగము (నీలఛత్రీ) నేటికి నచ్చేయున్నది ఇట నా మహారాజొక గొప్ప హోమము మొనర్చెనందురు. ఇంద్రప్రస్థపురము తొల్లింట ఖాండవవనమగుట నీదేశమునకు ఖాండవప్రస్థమనియుం బేరుండెను ఢిల్లీపురమున తొల్లింట పాండవులకోట యుండిన తావునకు ఇంద్రపాట్ అనియు, పురానా ఖిల్లా యనియు ననుచున్నారు ఇది రాజసూయయాగ మాభూమిని మొనర్చినతావందురు ఇంక నిట

**ఇంద్రాణీక్షేత్రము** — బంగాళమున బర్ద్వాన్ మండలములోని కట్వా సమీపమున అజయనదిపైనున్న క్షేత్రము

**ఇంద్రాతిథి గోత్రము** — ఆత్రేయ గణము చూడుడు

**ఇంద్రావతీనది** — ఇది బస్తరు సంస్థానములోని జగ్దల్పూరు ప్రక్కబడి ప్రవహించు నది గోదావరీ దియుంగ సంగమించును దీని జగధరపురమని కూడ ననుటయు గలదు ఈ నదియందు గొప్ప వంతెన గట్టియున్నారు

**ఇంద్రావరజుడు** — ఉపేంద్రునకు ఇంద్రావరజుడని పేరుకలదు.

**ఇంద్రియములు** — త్రివిధములు ౧ జ్ఞానేంద్రియములు ౨ కర్మేంద్రియములు 3 అంతరింద్రియములు

౧ జ్ఞానేంద్రియములు ౫ ౧ శ్రోత్రము (చెవి) ఈ ఇంద్రియము గ్రహించు తన్మాత్ర శబ్దము ౨ త్వక్కు (చర్మము) ఇది గ్రహించు తన్మాత్ర స్పర్శము (తాకుట) 3 చక్షు (నేత్రము) ఇది గ్రహించు తన్మాత్ర రూపము ౪ జిహ్వ (నాలుక) ఇది గ్రహించు తన్మాత్ర రసము (రుచి) ౫ ఘ్రాణేంద్రియము (ముక్కు), ఇది గ్రహించు తన్మాత్ర గంధము (వాసన)

౨ కర్మేంద్రియములు ౫ ౧ వాక్కు (నోరు మాటలాడునది) ౨ పాణి (చేతులు పనిచేయునవి) 3 పాదములు (నడచునవి) ౪ పాయ్వింద్రియము (మలము విసర్జనము చేయునది) ౫ ఉపస్థేంద్రియము (ఆనందము గూర్చునది) ఇవియైదు కర్మేంద్రియములు

3 అంతరింద్రియములు మనస్సు బుద్ధి అహంకారము (అహంభావము) అంతరింద్రియము లనంబడును దీనికి మతాంతరమున కొందఱు చిత్తము గూడచేర్చి అంతఃకరణ చతుష్టయమందురు జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియము లైదును గలసి దశేంద్రియములనుచున్నవి

**ఇంద్రియాత్మవాదిమతము** — దీనికి లోకాయితమతమనియు నిరీశ్వరవాదిమతమనియు వాడుకకలదు ఇదియు చార్వాక మతముతో సంబంధించి మతమే దానికిని దీనికిని గలభేద మాత్మనిర్వచనము నందే కలదు. చార్వాకులు ఇంద్రియసంయోగము (శరీరేంద్రియముల కూటమి) నాత్మయందురు విరోచన మతస్థులు స్థూలశరీరమునాత్మయందురు వీరిటుల గాక స్థూలశరీరమును డి ఆత్మ వేఱందురు శరీరేంద్రియముల కూటమియే యాత్మ యయ్యెను అస్థూలశరీరమును డి వేఱుగనుండుచు దేనిని గ్రహించి యెవరి ఆజ్ఞ ననుభవించుచున్నదో అది లేకుండుట స్మృతి ననుభవించుచున్నదో అట్టి యాత్మ శరీరమును డి వేఱుగ నుండకున్నచో స్మృతికి పూర్వముగల పిదప శరీరమునకే యనుభవించగా ఇంద్రియసంయోగమగు నాత్మ శరీరమునుండి వేఱుగనుండిన దీని సిద్ధాంతము మఱియు స్మృతి ఇంద్రియముల యధీనముగాన దీనికి ఇంద్రియాత్మవాదిమతమని పేరు తక్కిన వన్నియు చార్వాక మతమునుండియే గ్రహింపబడినవి ఈ మతకర్త లోకాయితుడని చెప్పబడినది (చార్వాకమతము దేహాత్మవాదిమతము ప్రాణాత్మవాదిమతము చూడుడు)

**ఇంద్రుడు** — దేవతలకు ప్రభువు పూర్వదిక్కునకధిపతి తండ్రి కశ్యపబ్రహ్మ తల్లి అదితిదేవి అర్జునుడీతని యంశమున జనించినవాడు రాజధాని అమరావతీపురము (దీనిని స్వర్గమనియు నందురు) భార్య శచీదేవి ఈమె పులోముని పుత్రిక ఆయుధము వజ్రము వాహనము ఐరావతము (తెల్లయేనుగు) సభ పేరు

**Edwin, Edwyn-** ట్యూటోనిక్కు పదము Rich friend అని యర్థము

**Edwy-** ట్యూటోనిక్కు నామము, ఆంగ్లసీమ నేలిన యొక భూపాలుని పేరు, Rich war అని యర్థము

**Egbert-** ట్యూటోనిక్కు నామము, వెసెక్సు రాజు పేరు, Formidably bright అని యర్థము.

**Egerton-** (Pro-Edgertun) ఎవిన కల్పిత నామము

**Egmond-** ట్యూటోనిక్కు పదము, Formidable Protection అని యర్థము

**Eitel** ట్యూటోనిక్కు పదము, Vain అని యర్థము

**Eldred-** Eldrid ట్యూటోనిక్కు పదము, Battle Councillor

**Eleazea-** Eleazar హీబ్రూ నామము, Lord's help అని యర్థము

**Eli, Elia, Elias, Elic, Elihu, Elija, Elijah, Ellis, Ely** హీబ్రూ పదము, Exalted God the Lord అని యర్థము

**Eliab** హీబ్రూ పదము, God is his father అని యర్థము

**Elidor-** లాటిను నామము, Lover of God అని యర్థము

**Elisha-** హీబ్రూపదము, God's salvation

**Ellison-** నవీనకల్పితము

**Ellis** హీబ్రూనామము, God the Lord అని యర్థము.

**Elphinstone** నవీన కల్పితము

**Elphin** - కెల్టిక్కు నామము, తెలుపున కర్థము.

**Elswald** పురాతన ఆంగ్లనామము.

**Emanuel-** హీబ్రూపదము, God is with us అని యర్థము.

**Emerenteus** లాటినునామము, Deserving అని యర్థము

**Emery-** Emeric ట్యూటోనిక్కు పదము, Work ruler అని యర్థము.

**Emilius-** Emil లాటినునామము, worker అని యర్థము

**Emlyn-** ట్యూటోనిక్కు నామము, Work serpent అని యర్థము.

**Emmanuel-** Immanuel హీబ్రూనామము, God with us అని యర్థము

**Engelbert** ట్యూటోనిక్కు పదము, Bright angel అని యర్థము

**Enoch** హీబ్రూనామము Dedicated అని యర్థము

**Enrik** Enrique ట్యూటోనిక్కు నామము, Home ruler అని యర్థము

**Eusoi** నవ కల్పితపదము

**Ephraine-** హీబ్రూ పదము, Twofold increase fruitful అని యర్థము

**Erasmus-** గ్రీకు నామము, Amiable అని యర్థము

**Erastus** గ్రీకు పదము, Lovely అని యర్థము

**Eric -Erik, Erick** ట్యూటోనిక్కు పదము. Powerful king

**Erling** ఆంగ్లో సాక్సనునామము, Earl's son అని యర్థము.

**Ermin-** కెల్టునామము, Lordly అనియర్థము.

**Ernald-** నవీననామము

**Ernest-** ట్యూటోనిక్కు నామము.

**Erskine-** నవీనకల్పితనామము

**Esau-** హీబ్రూనామము, Hairy అనియర్థము

**Esme-** నవీనకల్పితనామము.

**Esmeralda-** గ్రీకునామము, Emerald అని యర్థము.

**Essex**- నవీనకల్పితనామము, దేశనామము

**Ethelbert**- ట్యూటానిక్కు-పదము, Noble and Bright అని యర్థము

**Ethelred**- ట్యూటానిక్కు-పదము, Noble Council అని యర్థము. ఆంగ్లసీమనేలిన భూపాలుర కీపే రిద్దరి కుండెను.

**Ethelwolf, Ethelwulf**- ట్యూటానిక్కు-నామము. Noble woulf అని యర్థము

**Etienne** గ్రీకునామము, Crowned అని యర్థము.

**Eugene**- గ్రీకునామము, Well born అని యర్థము

**Eusebius**- గ్రీకునామము, Pious అని యర్థము

**Eustace**- గ్రీకునామము, Firm Happy అని యర్థము

**Evan, Evans**- శెల్టిక్కు-పదము, వేల్సు దేశమున ప్రచారముకలది Young Warrior అని యర్థము.

**Evelyn**- లాటిన్ నామము, Hazelnut

**Everard**- ట్యూటానిక్కు నామము, Strong wild Boar అని యర్థము.

**Ewan**- శెల్టిక్కు-నామము, Warrior అని యర్థము.

**Ewart**- ట్యూటానిక్కు- నామము, Firm wild Boar అని యర్థము

**Eyre**- నవీనకల్పితనామము (ఉచ్ఛారణ Air)

**Ezekiel**-హిబ్రూపదము, God will support అని యర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేరు Zeke

**Ezra**- హిబ్రూనామము, Helper అనియర్థము

## 'ఇ' అక్షరమునకుం జెందిన క్రైస్తవస్త్రీల నామములు —

**Easter** ట్యూటానిక్కు- పదము. ఈస్తరనంబడు పండుగపేరు.

**Edeline**- ట్యూటానిక్కు-పదము ఉన్నతమగు (గొప్ప) జన్మమని యర్థము

**Edeltrude**- ట్యూటానిక్కు-పదము, ఉన్నత జన్మసంబాధమని యర్థము

**Edena**- ట్యూటానిక్కు-పదము, ఐశ్వర్యపుకావలి యని యర్థము

**Edgetha**- సాక్సనుపదము, Edith వంటిదేనని కొందఱు తలంతురు

**Edgina, Edgiva**- సాక్సను పేరులు, తొల్లింట సాక్సను భూపతుల కుమార్తెల కీపేరు లుండెను.

**Edith, Editha, Edythe, Edgytha**- ట్యూటానిక్కు పదములు, సుఖకరమగు ఈవి యని యర్థము St Edeth అని పేరుగల యొక ఆంగ్లరాజకుమారిత యుండినట్లు తెలియు చున్నది (ఆమె క్రీ. శ. ౯౮౪ లో మరణించెను.) దీనినుండి కలిగిన ముద్దుపేరు, Edie, Edy.

**Edna**- హిబ్రూపదము సంతసమని యర్థము.

**Edwina- Edwyna**, ట్యూటానిక్కు పదము, ఐశ్వర్యముగలవారితోడి మైత్రియని యర్థము. Edwin- Edward, ల యొక్క స్త్రీ వాచకపదము.

**Eereenia**- గ్రీకుపదము, శాంతి యని యర్థము.

**Eefa, Effie**- స్కాచిపదము, మాజాలవాగ్ధోరణి యని యర్థము.

**Egbertine**- ట్యూటానిక్కు-పదము, Egbert యొక్క స్త్రీవాచకపదము.

**Eglantine**- కపిత్థమని యర్థము. ఒక పుష్ప మొక్క పేరు

**Eguina**- సాక్సనుపదము, ఒక సాక్సనుభూపతి కీపేరుగల యొక భార్య యుండెనంట.

**Eileen**- ఐరిషుపదము, వెలుతురని యర్థము.

**Eirene**- గ్రీకుపదము, శాంతి యని యర్థము.

**Ela-** నార్వేపదము, పవిత్రత యని యర్థము

**Eleanor, Eleanora, Eleanore, Elinor, Elena, Elana, Elaine, Elayne-** గ్రీకు పదములు వెలుతురని యర్థము దీనినుండి కల్గిన ముద్దుపేర్లు Ellen Nellies, Nell Ella, Nora, Aileen, Helen

**Elfleda-** ట్యూటోనిక్కు పదము, అభివృద్ధి అని యర్థము

**Elfrida-** ట్యూటోనిక్కు పదము, మెరపించుట కర్తమని కొందఱనెదరు

**Elgina-** సాక్సనుపదము Edward అనుపేరు గల సాక్సనుభూపతి కొమరిత కీపేరుండెను

**Elgiva-** ట్యూటోనిక్కు పదము, ఈవి యని యర్థము

**Elizabeth, Eisabeth Elisa, Elise, Eloise** హెబ్రూపదములు, దేవుని ప్రమాణమని యర్థము దీనిను డి కల్గిన ముద్దుపేర్లు పెక్కు గలవు Bess Bessie, Bessy, Beth, Betsy, Betty, Bethia, Bettine Elsa Elsie, Liz Lizzie Libby Lisa Liza Lisette

**Ella Ellie, Ellen** గ్రీకుపదము వెలుతురని యర్థము

**Elma-** గ్రీకుపదము కలుపుతుండుయు మటయని యర్థము

**Elsie** ట్యూటోనిక్కు పదము, విశాలహృదయముగ యోగ్యమని యర్థము

**Elspeth-** స్కాచిపదము, దైవముబ ధ ప్రమాణమని యర్థము Elizabeth యొక్క స్కాచిపదమని కొందఱనెదరు దీని గల్గిన ముద్దుపేరులు Elspie, Elsie

**Elvira-** లాటిన్పదము, స్వచ్ఛమైన యని యర్థము

**Emerence, Emerentia-** లాటిన్పదము, అర్హత యని యర్థము.

**Emily, Emilia, Emilie, Emeline, Emelina-** లాటిన్ పదములు, శరీరశ్రామ గల పనివంతురాలని యర్థము. దీనిం గల్గిన ముద్దుపేరులు Emm, Emma, Emmie.

**Emlyn** ట్యూటోనిక్కు పదము, పనిచేయు నర్పురాని యర్థము

**Emma, Emme** ట్యూటోనిక్కు పదము, ముసలమ్మ యని యర్థము

**Ena-** కెల్టిక్కు పదము, ప్రాణమని యర్థము

**Enid Enaid Oenide** కెల్టిక్కు పదములు, ప్రాణి యని యర్థము

**Enriqueta, Enrichetta** ట్యూటోనిక్కు పదములు గృహపాల మని యర్థము దీని నుండి కల్గిన ముద్దుపేరు Etta

**Eppie** స్కాచిపదము, రూచి ప రిస్థ యని యర్థము

**Erica Erika** ట్యూటోనిక్కు పదము, Eric యొక్క స్త్రీవాచకపదము బలవంతురాలని యర్థము

**Erina** ఐర్లాండు యొక్క పేరు

**Ermelinda** ట్యూటోనిక్కు పదము, ప్రచ నాగవని యర్థము

**Ermentrude** ట్యూటోనిక్కు పదము, జాతీయ వనిత యని యర్థము

**Ermin Erminda, Erminia** వెల్షుపదములు. ప్రభు చిహ్నములు గల్గిన యని యర్థము

**Ermyntrude** ట్యూటోనిక్కు పదము, జాతీయ వనిత యని యర్థము

**Ernestine, Ernstine** ట్యూటోనిక్కు పదము, Ernest యొక్క స్త్రీవాచకపదము.

**Esmay, Esme-** గ్రీకుపదము, పచ్చ (రత్న మని) యర్థము

**Esmeralda** గ్రీకుపదము, పచ్చ (రత్న మని) యర్థము

**Esther,** Estelle, Estella, Ester, Esterre లాటిను పదములు, నక్షత్ర మని యర్థము. దీనంగల్గిన ముద్దుపేరులు Essie, Esther

**Ethel**- ట్యూటానిక్కు పదము, గొప్పజన్మపు అని యర్థము

**Etheldreda**- ట్యూటానిక్కు పదము, గొప్పత్వ వెలింపు అని యర్థము

**Ethelinda, Ethelind** — ట్యూటానిక్కు పదము, గొప్పత్వనాగమని యర్థము

**Ethelward** ట్యూటానిక్కు పదము, కాతురని యర్థము

**Ethelwitha**- ట్యూటానిక్కు పదము, ఆల్ఫ్రెడ్ ది గ్రేటను భూపాలుని పుత్రికపేరు

**Ethelwyne**- ట్యూటానిక్కు పదము, ప్రసిద్ధి కర్థము

**Etiennette**- గ్రీకుపదము, కిరీటమని యర్థము మరియు Stephen యొక్క ఫ్రెంచిరూపమనియు నందరు.

**Etrenne**- గ్రీకుపదము, ఇవి లేక బహుమాన మని యర్థము

**Eudora**- గ్రీకుపదము, సంతస (లేక సుఖకర మగు) బహుమానమని యర్థము

**Eudoxia, Eudoxie, Eudocia**- గ్రీకు పదములు, ఎక్కువగౌరవమని యర్థము

**Eugenie, Eugenia**- గ్రీకుపదములు, గొప్పత్వజన్మ మని యర్థము దీనినుండి గల్గిన ముద్దుపేరులు Genie, Eugene యొక్క స్త్రీవాచకపదము. ఇది యొక ఫ్రెంచిచక్రవర్తిని పేరుగ వ్యాపకమందిన పదము

**Eulalia, Eulalie**- గ్రీకుపదము, మంచివాగ్ధోరణి యని యర్థము

**Eunice**- గ్రీకుపదము, సంతసమగు జయమని యర్థము.

**Euphemia, Euphemie**- గ్రీకు పదము, ఎక్కువ ప్రసిద్ధి అని యర్థము. దీనినుండికల్గినముద్దుపేరులు Effie, Euphie, Pheme.

**Euphrasia, Euphrasie, Euphrosine** గ్రీకుపదములు

**Eva Eve** - హీబ్రూపదము, ప్రాణమనియర్థము. Adam యొక్క భార్య పేరు దీనినుండి కల్గిన ముద్దుపేరు Evie

**Evangeline**- గ్రీకు పదము, సంతసవార్తలం దెలుపు వనితయని యర్థము.

**Eveleen, Evelina, Eveline, Evelyn**- కెల్టిక్కుపదములు, మోదావహమైన యని యర్థము దీనియందుగల్గిన ముద్దుపేరు Evie.

**Everhilha, Everilda**- ట్యూటానిక్కు పదము ధైర్యవంతురాలని యర్థము

**ఇకన్** — ఐకన్ చూడుడు

**ఇకోనోగ్రాఫీ** (Iconography) — (విగ్రహ చిత్రలేఖనము) పటములు, విగ్రహములు, చిహ్నములు, రత్నములు మొదలగు ఆనవాళ్లంబట్టి గొల్లి టి పవిత్ర స్థలములను, చరిత్రలను, విశేషముంకు పోల్చువిద్య

**ఇక్థియాలోజీ** (Ichthyology) — మత్స్యజాతుల శరీరనిర్మాణ లక్షణాదులం గూర్చిన కళ

**ఇక్వు-ఆజు జలపాతము** — బ్రెజిలేశమునకు అర్జంటీనా దేశమునకును నడును సరిహద్దునందున్న రెండుమైళ్ల ప్రదేశమునందు జలపాతము కలదని చెప్పబడినది. రెండువందల అడుగుల ఎత్తునుండి జలమునుపడు జలపాతమట. దీనింగూర్చిన వివరములు సరిగా తెలియరాకున్నవి

**ఇకో్నమీటర్** (Iconometer) — పరిమాణమును తెలిసికొనిన ఒక వస్తువునుండి కొంతదూరమునంగల వేరొక వస్తువుయొక్క పరి

మానము ఆ దూరమయొక్క పరిమాణము నుండి ఎరుగనగు పరికరము

**ఇక్నోలితోలోజి** (Ichnology or Ichnolithology) a fossil foot print — ఇప్పుడు రాళ్లుగ మారియున్న తొల్లింటికాలపు మట్టి ఇసుకలపై నాకాలపు Fossil జంతువుల అడుగులానవాళ్లు కానవచ్చును. ఇది వానిఁ ట్టి పోల్చెడి కర

**ఇచ్చేవారినిచూస్తే చచ్చేవాడైన లేచివస్తాడు** — ఆంధ్రలోకోక్తి

**ఇచ్చేవానికిపత్రము, చచ్చేవానికి ఔషధము అనవసరము ఐనను ఉండకతీరనివి** — ఆంధ్రలోకోక్తి

**ఇశ్రాయేలులు** (ఇశ్రాయేలులు)—యూదుల దేవుడగు జెహోవా (యెహోవా) యాకోబు (Jacob) నకు ఇశ్రాయేలని పేరిడినటుల బైబిలు నందు చెప్పబడి ది. దీనికి హిబ్రూభాషయందు Perseverer with God అని యర్థమట. రానురాను ఆయన సంతతివారికి యూదులకు హిబ్రూలకు గూడ నదియే వాడుకపేరయ్యెనట

**ఇటలీదేశపుపూర్వగాథ** — యూరోపా దేశమందలి రాజ్యము (తొల్లింట చాల పేరొందిన బలాఢ్యమగు మహారాజ్యము, సామ్రాజ్యమునై యుండెను) గొప్ప వస్తుత్వము కును, కళల కును, ధర్మశాస్త్ర నిర్మాణమునకును రాజ్యపాలనాతంత్రమునకును పేరొందిన రాజకీయవేత్త లీ దేశమున పలువురు రుండిరి. మధ్యధరాసముద్రము చుట్టు నీ సామ్రాజ్యరాజ్యము వ్యాపించియుం డినకతన మధ్యధరాసముద్రము రోమనుల సరస్సనబడుచుండెను ఇది గతకాలమునాట సంగతి.

ఇటలీదేశము ఒకలక్ష పందొమ్మిదివేల చతురపుమైళ్ళ వైశాల్యముకలది యనియు, నాల్గు కోట్ల పదునొకండులక్షల ఏబదివేల జనసంఖ్య యనియుం చెప్పబడినది. ఇటలీదేశమునకు రోమకపురి (Rome) రాజధాని ఇందు ఇటలీ దేశపు భూపతియు, రోమనుకాథలిక్కు మతాధిపతియగు పోపు జగద్గురువును వసించుచుందురు. పోపుమహాత్ముని నివాసభవనము లన్నియుం గలిసి వెటికాన్ అను పేరం బరగడిని దీని నిటీవల పోపు మహాత్ముని ప్రభుత్వమున నొక స్వస్థానముగ నేర్పరచిరి. ఈ వెటికాన్‌సిటీ ప్రభుత్వము నూటఎన్మిది చదరపుమైళ్ల వైశాల్య ప్రదేశము కలది. ఎన్మిదివందల ప్రజలు వసించుచున్నారు. వెటికాన్ అనేక భవనముల సముదాయము. ఇందు చాలా సుందరతరమగు పెద్ద పెద్దసౌధములు కలవు

**ఇటలీ ఫారెన్‌పాలిజన్సు** — రెడ్సీ యొక్క నైఋతిదిగ్భాగభూమి తన స్వాతంత్ర్యసీటని చెప్పుచున్నది తూర్పుఆఫ్రికాలో జూబా నది మొదలుగల ప దేశముల నిటీవల వదలివేసి ది. టిపోలీరాజ్యమును టర్కీను డి ఇటీవల నాక్రమించినది

ఇటాలియనుసోమలీలాండు తూర్పుఆఫ్రికాయందన్నది ఇది ఇటలీరక్షితమై యుండెనట. ప జలు సోమలీలు గల్లాజాతివారును కలరు. వారు క్రూరు లనియు, స్వేచ్ఛాప్రియు లనియుం చెప్పబడినవారు. ఇటీవల ౧౯౩౫-౩౬ సంవత్సరములలో నిటలీవారు తూర్పు ఆఫ్రికాయందుగల అబీసీనియాపై దండెత్తి, యాక్రమించి దానిని తమవలసరాజ్యములలోఁ గల్పుకొనిరి

**ఇటలీదేశపు సామెతలు** — అప్పు లేకపోవడ మొక యైశ్వర్యలక్షణమే. అబద్ధ మాడదలతువేని, నిజము దానిని బయలుపర్చకుండానే త్వరపడుము. అమ్మవారి కొక నేత్రమైనా చాలుగాని, కొనేవారి కనేక నేత్రములుండవలయును. అరచే కుక్కలు వేటకుం బనికి

రావు ఇ టికంతకూ ఒక బుద్ధిహీనుఁ డుం టేనే చాలును ఒక్కటిగనే కల్గిన మనదృష్టమును దీవించబడవలసినదే ఒకజోకు అ దానికి సరిపోను కంచె మంచిదికాక పోతే అంతా దాంటుతాను గెడ్డము పొడుగుగా పెరిగితే జ్ఞానియగునా? గొప్పవారితో మైత్రి సింహముంతో సోదరత్వము వంటిది చాలా కాలా మున్నవస్తువే శాకగా కిట్టనట్లు ద్వారం పొట్టిదైతే వంగినడవడం అల వాటుచేసుకో ధర శాగున్నా డబ్బు నూచు కుని కొనవలసియుంటుంది సోకి గోడిగి యవ్వాలి కేగినవానికి గోతు తెలియకుండునా? నేరం చేసినవాని కంతావిరోధులవలె గప్పిస్తాను నేర్పు గల న్యాయాధికారి తా నేవస్తువుపై నాశ వదల గలడు? పిల్లలు లేనివానికి ప్రేమ సరిగా తెలి యదు పిల్లికి చేప లిష్టమేగాని నీళ్ళ యందు ప్రవేశము వేగమె ముగియుం గాని తాంని వర్షము చాలాకాలము పట్టును ప్రేమను కొంత వలెన లే ప్రేమయే ఖరీదు బాగుండినవి కార్యము శాగానే కలిసివస్తుంది బాట శాగ డక పోతే పరుగెత్తరాదు. బుగదనివియు దేని ప్రతిఫలించ ము చిపాం ధము నగముజయము వారికి మాటలే ఆపనివానికి అనృతదోష మెల్లారోపించును? రెండవసారి కుడిచిన ఆ రోచ నలో దాడుగరాదు

**ఇటలీదేశము** — ఐరోపాఖండమూ దక్షిణభాగమునను న్న ద్వీపకల్పము ఇది ౧,౧౧,౦౦౦ చతురపు మైళ్ల వైశాల్యమని యందురు ఈద్వీపకల్పమునకు దక్షిణపు కడను కలావోరియా ద్వీపకల్పము, అపూలియా ద్వీప కల్పము అను రెండు ద్వీపకల్పములు చిన్నవి కలవు. వీనినడుమను టారంటోనయుక్తాగ్ర గుడము కలదు మధ్యధరా సముద్రమున సిసిలీ ద్వీపము, సార్డీనియా ద్వీపము, లిపారీ ద్వీప సమూహము (చిన్నవి), ఉస్డికా ద్వీపము దీనికిం

జెందిన ద్వీపములు ఇంకను ఇంచుక పశ్చిమమున సిసిలీ ద్వీపమునకు దక్షిణముగా Pantellaria అను పేరుగల వేరొక చిన్నద్వీపముకలదు ఇది ఇటలీ దేశమునకుం జెందినదియె ఇట్టి ద్వీపము లింకను పశ్చిమమున సముద్రతీరమునందే విశేష ముగా గలవు గాని, యవి అంత ప్రాముఖ్యమైనవి కావు పశ్చిమ సముద్రపు బయలు ప్రదేశ మంతయు మలేరియా జ్వరపీడితమై అనారోగ్య పదమైనదికలదు ఇది టుస్కానీ మొదలు నేపిల్సు వరకునని చెప్పఁబడినది దీనికి మారెమ్మయని పేరిడియున్నారు మారెమ్మయనిన సముద్రతీర మని యర్థమట ఈ ప్రదేశము కేవల సముద్ర తీరమని యెంచుగునది ఉత్తరముగ నీ ప్రదేశమును Campagna de Roma (రోమకపుబయలు) పొంటను Pontine marshes అను భాగము దక్షిణమును కొద్దిగనో గొప్పగనో అనారోగ్య ములుగ తలంపఁబడుచున్న ప్రదేశములే ఆల్ప్సు పర్వతము ఉత్తర ప్రదేశపు సరిహద్దుల కు వంకరగా తిరిగెడిది దేశము పొడుగునను ఎపెనైను పర్వతము లగుపడుచుండుట కానవగును

సిసిలీద్వీపమున కు ఎట్నా యను పేరుగల యగ్నిపర్వతము కలదు ఇది ౧౧,౦౦౦ అడు గుల ఎత్తు మట్టుకొంత ౮౭ మైళ్లు ఇది దిగువభాగము నదని కొంత యని యెంచుగునది నేపిల్సుపురమునకు బదిమైళ్ల దూరమున వెసూవి యస్సనంబడు వేరొక యగ్నిపర్వతము నాల్గువేల అడుగుల యెత్తున్నది చరిత్రకెక్కినదగు దీని యుద్భృతము క్రీ. వె ౭౯ వ సంవత్సరమున జరగను. ఆయుద్భృతమునకే హెర్క్యులేనియమ్ పట్టణమును, పాంపీపట్టణమును నాశనమైనవి ఇంక స్ట్రాంబోలీ యను వేరొక యగ్నిపర్వత శిఖరము చిన్నదియైనను చాల పడిగలదిగఁ జెప్పఁ బడినది ఇది సిసిలీకుత్తరమున లిపారీద్వీపము లందు కలదు ఈద్వీపములు అగ్నిపర్వతము

లుంట పేరందినవి. వీనినుండియే దక్షిణదేశ భాగములు భూకంపముల కాస్పదములని యనెదరు

ఆల్ప్సు పర్వతములకు ఎపినైను పర్వతములకు నడుమగుండా పోనది, అడిగేనదియును పూర్వవాహినులై ఎడ్రియాటిక్కు సముద్రముగ సంగమించుచున్నవి ఎపినైను పర్వతములందలి పశ్చిమపు ఏటవాలు ప్రదేశముగుండా ఆర్నోనది, టైబరునది, వొల్టూర్నోనది ప్రవహించి మధ్యధరాసముద్రమున సంగమించుచున్నవి ఇందు పోనది దేశమునగల నదులలో పెద్దనది దీనికి మిన్సియోనది, అడ్డానది, టిసినోనది ఉపనదులై దీనియందు సంగమించుచున్నవి ఈయుపనదులును ఆల్ప్సు పర్వతములకడనున్న గార్డా సరస్సు, కోమోసరస్సు మగ్గియోర్సరస్సులందు జనించిననదులు పోనది వరదముంపులనుండి కాపాడుట కిరుదెసల గొప్ప ఎటకట్టలను నిర్మించి యున్నారు మఱియు దీనియుపనదులు చాల సస్యోపయోగముగ దనరుచు పంటల నుద్ధరించు చున్నవి

ఎపినైను కొండలు మార్బిలు రాళ్లగనులకు పేరందినవి సిసిలీ దీవియందు గంధకము విస్తారముగ దొరకుగనులు కలవు ఎల్బాద్వీపమున ఇనుపగనులు కలవు గోధుమలు, జొన్నలు ముఖ్యములగు పంటలు ద్రాక్షలు విస్తారము పైరుచేయుంబడుచున్నవి ఆలివ్తోటలు నూనె కొఱకు విస్తారముగ పెంచఁబడుచున్నవి పట్టుపురుగుల పెంపకమునకు మల్బెర్రీ తోటలపరిమితముగ గానవచ్చుచుండును పట్టు పరిశ్రమయం దెక్కువ యీదేశముననే నేయం బడుచున్నది సముద్రములందు పగడములు, స్పంజి విస్తారము సిసిలీచుట్టును లభించుచున్నవి.

ఇటలీ ప్రజలు తొల్లింటి రోమనుల సంతతివార మనియెదరు చాల రసజ్ఞులు వీరిభాష లాటిన్భాషాజన్యము శ్రావ్యమై కర్ణరసాయనమై యుండుటచేగ పేరందినది పాశ్చాత్యు లాంధ్రభాషను Italian of the East అని వారి ఐరోపాభాషకు ఇటలీభాష కతిశయోక్తిగ సాదృశ్యభాషగ బల్కుచుండను ఈదేశపు సంగీతపాటకు లైరోపాయుంద తటను సంచార మొనర్చుచు ద్రవ్యార్జన మొనర్చుచుందురు రోమన్ కాథలిక్కు క్రైస్తవమతము దేశమతమై యున్నది ఈ మతాధ్యక్షుఁడగు పోపు జగద్గురుండు రోమకపురి పరిసరములను వెటికాన్ నివాసుఁడు

కొలఁదికాలము క్రిందటవఱకు ఇటలీదేశము ౧ సార్డీనియారాష్ట్రము, ౨ ఆస్ట్రియనిటలీస్టేటు, 3 పార్మా, ౪ మొడేనా ౫ టుస్కానీ ౬ పాపస్టేటు, ౭ నేపిల్సురాజ్యమునను, ఇందు భాగములు ముఖ్యములుగను, కొన్ని ఇతరస్ర దేశములుగను, సాన్మారినో యను పేరుగల యొక చిన్న ప్రజా ప్రభుత్వముగను చీలియుండినది క్రీ వ ౧౮౫౯ లో ఫ్రెంచివారి సహాయముంగొని లోంబార్డీ ఆస్ట్రియావారి నుండి తిరుగ లాగుకొని సార్డీనియాకుం జేర్పబడినది ఆ మఱుసటి సంవత్సరమున పార్మా, మోడేనా టుస్కానీ స్టేట్లును, పాపస్టేటున దలి విస్తారభాగమును సార్డీనియారాజ్యమునకుం జరిపోయినవి ఈ దేశమున సుప్రసిద్ధుఁడగు గారిబాల్డీసేనాని నెపోలియన్ రాజ్యమును బడద్రోసి సార్డీనియాభూపతి నిటలీభూనాథునిగ నొనర్చెను క్రీ. వ ౧౮౬౬ లో ప్రష్యావారి సహాయముం గొని ఆస్ట్రియావారినుండి వెనీషియా తిరుగలాగుకొనఁబడెను క్రీ. వ. ౧౮౭౦ లో పోపుగారినుండి రోము లాగుకొనఁబడి, ఇటలీకి చేర్చుకొనఁబడి

పురము తొల్లింటి పార్మాడచ్చీ రాజ్యమునకును, మోడేనాపురము తొల్లింటి మోడేనాడచ్చీకిని, రాజధానులుగ నుండిన పురములు ఎడ్రియాటిక్కు-సముద్రతీరమున నున్న రావెన్నాపురము తొనుకటి రోమనుసామ్రాజ్యమునకుఁ గడపటిరాజధానిగ నుండిన తావు రావెన్నాపురమునకు దక్షిణమున సేన్మార్నినో యను పేరుగల చిన్న ప్రజాప్రభుత్వము చిరకాలమునుండి కలదు.

౫. టుస్కానీప్రోవిన్సు ఎమిలియాకు దక్షిణమున నున్నది తొల్లింట నిది గ్రాండుడచ్చీరాజ్యమై యుండినది మిగుల ఫలవంతమైన ఆర్నో లోయ ఈ ప్రోవిన్సులోనిది కను సుందరవంతము ఆర్నోకు దక్షిణముగ సముద్రతీరప్రదేశమగు మారెమ్మ (Maremma) సీమ బురద నేలలు, అనారోగ్యప్రదేశము మయమైనది. ఫ్లారెన్సుపురము ఇచటి ముఖ్యపట్టణము సౌందర్యవంతమని యీమాట కర్థమని కొందఱును, పుష్పనగరమని యర్థమని కొందఱును చెప్పుచుందురు ఆర్నోనదీతీరము ఇట చిత్రకళా విగ్రహాదిద్న్యశాలలు కలవు. పైజా నగరము ఒరగిన గోపురముకతన పేరొందినది. (వాల్యు. ౧) ఇది గలీలియోపండితుని జన్మస్థానము లెఘారను పురము గొప్ప ఓడరేవు ఇట గడ్డి అల్లిక చిత్రపు పనులు కలవు లుక్కాపురము, ఆలివునూనె వర్తకమునకుఁ బేరొందినది

౬. పాపల్ స్టేట్సు ప్రోవిన్సు- కొంతకాలము పోపుజగద్దేశికుని రాజ్యమైయుంట నీపేరయ్యెను ఈ ప్రోవిన్సు ఇప్పుడు పశ్చిమమున రోముపరగణాగను, నడుమను ఉంబ్రియా పరగణాగను, తూర్పున మార్చెసు పరగణాగను మూడుగ భాగింపఁబడి యున్నది. (పోపు చూడుఁడు). క్రీ. శ. ౭౫౫ మొదలు ౧౮౭౦ వఱకు పోపు రాజ్యాధిపత్యముకూడ వహించియుండెను కొంత కాలము ఫ్రెంచి ప్రభుత్వమువా రిపోపునకు చేయూత యొసంగి నిలువఁబెట్టి యుండిరి. కొంత సైన్యముచు వారు రోమునం దుంచుచుండిరి. ఫ్రాంకోజర్మనుయుద్ధము తటస్థముగుకతన నాసైన్యములు యుద్ధరంగమునకుం బిలువంబడు యదనున, ఇటలీదేశపుభూనాథుఁడగు విక్టరుఎమాన్యుయల్ ప్రభుఁడు అసహాయుఁడగు పోపున కింకను మిగిలియున్న రాష్ట్రముం గల్పుకొని, రోమకపురి నాక్రమించి త రాజధానిగ జేసికొనియెను

రోము నగరము (రోమకపురి) టైబరు నదీతీరమునం గన్నది కొంతకాలము సామ్రాజ్యపురాజధాని ఇప్పుడు ఇటలీదేశపురాజధాని ఇట లోకప్రసిద్ధిగల సెంటుపీటరుదేవస్థానము మాడఁదగిన చిత్రము పాతబస్తి రోమునగరము ఏడు కొండలపై నిర్మింపఁబడి యుండెను ఇప్పటి (క్రొత్త) రోము ౧౮ మొక మైదానమున నిర్మింపఁబడినది ఈ మహానగరము క్రీ పూ ౭౫౩ సంవత్సరమున రోమస్, రోమ్యులస్ అను పేర్లు గల ఇద్దఱు సోదరులచే ప్రారంభింపఁబడినది గొప్ప వైభవ మనుభవించి క్రీ. శ ౪౭౬ లో నాశనము చేయఁబడెను (వెటికాన్ భవనము చూడుఁడు) రోమకపురి వేసవికాలముగ మలేరియాజ్వరోద్రేకమున ననారోగ్యప్రదేశముగ నుండునని వాడుక కలదు. చివిటా వెక్చియాపురము రోము యొక్క రేవుస్థానము అంకోనాపురము పాపల్ స్టేట్సు ప్రోవిన్సు నందు వేఱొక రేవుస్థానము

౭ నెపోలియను ప్రోవిన్సు ఇది ఇటలీదక్షిణభాగము దీనిని సిసిలీద్వీపముతోఁ గల్పిన నేపిల్సురాష్ట్రమై యుండెను. దీనిం గొందఱు రెండు సిసిలీలనికూడ యనుచుండిరి క్రీ. శ. పన్నెండవ శతాబ్దమున నేపిల్సురాష్ట్రము నొక నార్మనుభూపతి స్థాపించియుండెను ఫ్రెంచివారు, పిదప స్పానియావారు దీని నాక్రమించియుండిరి. స్పానియావారి వశమున రెండుశతాబ్దముల కాల ముండెను. క్రీ. శ. ౧౭౩౪ లో స్వతంత్రరాజ్య

విచ్చియు ఇటుకలంజేయుచు లేకున్న ఇటుకలకు నిక్కచ్చిగా కొనలు లేలకుండుచు

ఇటుకల నెండించుట యీయూచు మొద లెన్మిది దినములు పట్టునాయును నీరు నారించుట ఇటకను ఆలక్ష్యమైన నుత్తమము గంగానది మొదలగు కొన్ని నదీతీరములందలి మట్టితో జేయంబడిన ఇటుకలు ఎక్కువగట్టిగ నుండి గుణముతో నైతము బహులకాలము నిల్చును ఇందలి మట్టియందు Iron మొదలగు లోహపదార్థము లుండునని పోల్చియున్నారు ఇటులు శాశ్వతముగ గట్టి నీరుదగిలని కాలమునైయుండును ఇందు పేర్పు నైతము ఇటుక యందు యునటుల గాలి బాయనటును కర్ర లంబేర్చి కమము నకుమ పెను సోరంగముల నుంచియు పేర్చుదురు ఇదియు నేర్పాత మే ఇటుక ఆవములకు Brick kilns అనియెదరు

ఒకలక్ష ఇటుకల ఆవముకు ఇంచుమించు ౭౦,౦౦౦ గట్టి ఇటుకలును ౨౦,౦౦౦ కొంచెము ర్దాగా కాల్పుకొక్కువ ఇటుకలును, తక్కువ ముక్కలుండి ౧౦ వంతు సర్వసాధారణముగా ఇటుకలాగిత్యాలము Glazed Bricks, Fire Bricks, Pointed Bricks, Arch Bricks, Terrace Bricks, Tiles, English Bricks మొదలగు పలురకము లు కలవు

**ఇడానాడి** — అష్టాంగ యోగములు చూడుడు.

**ఇడియమ్** (Idiom) — దేశీయపద లక్షణ ధర్మముల నాధారపడు నర్థముగల పదములకు ఇడియము అనిపేరు వాసిగూర్చినకళ

**ఇడీస్ ఆఫ్ మార్చి** (Ides of March)– రోమనులకాలమున మార్చినెల సంవత్సరమున మొదటినెలయై యుండునది మే నెల, జూలై నెల, అక్టోబరు నెలలందు పదునేనవదినము ఇడీస్ అయియుండునవి. తక్కిన నెలలందు పదమూడవ దినము ఇడీస్ గ పరిగణింపబడుచున్నది క్రీ.పూ ౪౪ సంవత్సరమున మార్చి (ఇడీస్) ౧౫ వ రోజున సీజరు చంపబడెనట

**ఇతోవ్యాఘ్ర ఇతస్తటీతిన్యాయము–** ఇటు పులి, అటు లోతుగల సరస్సు అనగా ఎటుపోవుటకు వీలులేని ఇరుకని భావము. ముందుకువస్తే నుయ్యి, వెనుకకువస్తే గొయ్యి యను నిట్టి తెలుగు సామెతకలదు

**ఇత్తడి** (పిత్తళి) — ఆంగ్ల Brass. సం రిరి, రీతి అను పదములు ఇత్తడి సామాన్యమునకును, సువర్ణకం అను పదము పసిమి ఇత్తడికిని పేర్లు ఇత్తడి, రాగిలో జింకును (తుత్తినాగమును) కల్పిచేయు నుపలోహము. ఇట్లయ్యు నీరొమును ప్రధానభాగములై ఇతర నితరలోహములు గూడ చేర్చి చేయు నితర ఉపలోహములకును తరుచు ఇత్తడియనియె వాడుచుందురు ఐరోపాఖండ దేశములందు క్రైస్తవ మాధువులపై చర్చిలకు పెల్లించెల్లు రేకుల ఇత్తడి యని (Brasses) పేరు వాడుకయుండె ఇత్తడిచేయు కర్మాగారములందు తుత్తినాగపుగాల్పు గాలిలో బీల్చుటవలన పనివారికనారోగ్యము కల్గి జ్వరము వచ్చుచుండునని వాడుకగలదు ఇత్తడికి పులుపుతగిలిన చిలుము పట్టును అది లోనికివెళ్ళి వికారముపెట్టి, వమనము గల్గించును ఆయుర్వేద వైద్యులు ఇత్తడిని శాస్త్రోక్తముగ భస్మముచేసి రోగుల కిచ్చెదరు సరిగా భస్మమైనచో ఇది కడుపు నొప్పిబల్లలు, కామెర, గుదరోగములు (అనగా మూలశంఖ, ఆసనగండమాల మొదలగునవి)- జ్వరములు, పాండురోగము, పైత్యరోగములు వాతజనితరోగములు, శ్వాస, సంగ్రహణి రోగముల నడచునని చెప్పబడినది

**"ఇదుగో పులి" అంటే "అదుగో తోక" అన్నాడట** — ఆంధ్రలోకోక్తి.

**ఇధ్మవాహ గోత్రము** — అగస్త్య ఉపగణము చూడుడు

**ఇధ్మవాహుఁడు**— ఋషి తండి పేరు దృశ్యుఁడు తాత అగస్త్యుఁడు ఇతనికి ఇధ్మ వాహనుఁడనియు, తేజస్వి యనియు నామములు కలవు

**ఇనకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు). ఇనకులగోత్రము, ఎకాక్షేయ గోత్రము (౭) దీనిని వారలు ఇంకోల వీరకోల యనియు నంపురు సంస్కృతగోత్రము సుందరస లేక సౌందర్యస, సుందరగణము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ, ప్రసూనాగ్రంథము అద్యక్ష వరఖండ విశ్వేశుఁడు దేవత, భార్య వీరాంబ హేమాద్రితపస్థానము, వీరసముద ము తటాకము జపముకోటి దీపములు గిర, క్షేత్ర సంఖ్య ౬౦, అశ్వదానము ఎట్టికలువ వ్యజ సీయము.

**ఇనపకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (ఇషుపకుల చూడుఁడు

**ఇనాక్యులేషన్** నేక్సినేషన్ చూడుఁడు

**ఇనుప గుగ్గిళ్లుకాని మినపగుగ్గిళ్లు కావు** — తనకు లొంగనివారిం గూర్చి చెప్పెడు సామెత (ఆంధ్రలోకోక్తి)

**ఇనుపగోలు చెట్టు** – లా Plantago ispaghula ఆగ్ల Ispaghul లేక Spogel tree ఈదేశమున వీనిగింజలు వైద్యోపయోగమునకు వాడఁబడుటదప్ప ఈచెట్లం గూర్చి యేమియు దెలియదు గింజలందు జిగటగలిగి చలువచేయును. మూత్రము వదలించును వేడి చేసిన కల్లు దగ్గు, గ్రహణి, పురాణగ్రహణి, పురాణరక్తగ్రహణి, మూత్రనిరోధము, సెగ మొదలగు మూత్రనిరోధరోగములను హరించును గింజల నుడికించినగుంజ దుష్టవ్రణములు, సెలయి మాన్పును. ఆకుల కషాయముగాని, వేరుగంధముగాని సర్పవిషదోషము హరించుననియు, ఆహికజ్వరములు, క్షయదగ్గులు నివృత్తి యగుననియుఁ జెప్పఁబడినది

**ఇనుపబాట** (Railway) వీనిలో ఎఱ్ఱ, ఆకుపచ్చ రంగుల యర్థము — ఎఱ్ఱరంగు భయంకరచిహ్నముగ నెల్లరకుం దోపజేయుఁగదే గాన ఎఱ్ఱరంగు జెండాయును, ఎఱ్ఱరంగు దీపములును అపాయసూచకములుగ నేర్పడియుండుట అందరెరుంగదగినదే

ఇంక దానికి ఎదురగు రంగు ఆకుపచ్చ అపాయము లేదనియో, నెమ్మదిగనో, జాగ్రతగనో పోవచ్చు నియు సూచించుచుండుటగ నుండదగినది ఎలన, ఎరుపునుండి ఆకుపచ్చ నడుమనుండు రంగులలో నేదియు దూరమున కంత స్పష్టముగ గానరానివిగాన పాటింపబడలేదు

ఈమధ్యకాలమున తెల్లరంగు క్షేమము లేక అనపాయమునకు చిహ్నముగ నుండెంగాని, ప్రమాదవశములనేరంగు అద్దమైనను పగిలిపోయి యెడిపోయినతర గన్పించునది తెల్లరంగు దీపమే యూటు, అచట నచట ప్రమాదములు సద్ధమై, పెక్కు ఇనుపదారిసంస్థలవారిచే తెల్లరంగు వదలివేయఁబడినది ఉదాహరణకు కొన్ని ఇనుపబాటలయందు వాడబడెంగాని దూరమునకు అస్పష్టమని తేలుట జేసి మానుకొనిరి గాన ఎరుపును, ఆకుపచ్చయు వాడుకయందున్నవి

**ఇనుము (ఉక్కు)** — ఇనుము స్వతస్సిద్ధమగు పంచలోహములలో నొకటి. గట్టి లోహము అన్నిలోహములకన్నను ఎక్కువ ఉపయోగకరమయ్యు, సర్వసాధారణముగ నెక్కువగ లభించునుగాన చౌకగకూడ నైయున్నది.

ప్రాశ్చాత్యవిజ్ఞానులగు పరిశీలకులు మొట్టమొదట ఇనుమునుగూర్చి ఎఱుగనిదినములందు రాతితోను, ఇత్తడికంచులతోను, ఆయుధములు, పనిముట్లు చేసికొనుచుండిరనియు, బహుశః ఇనుము మొట్టమొదట Meteoric stones నుండి (ఆకాశము నుండిపడినవి) సంపాదింపఁబడియుండునోపుననియు, తలంచుచున్నారు కాని, కృతయుగాలంకారభూతుఁడగు మాంధాతమహాపతియె చంద్రాయుధము ధరించినటుల చెప్పఁబడియుంటను, ఇంక నాయుధములనుగూర్చియు, లోహముంగూర్చియు మనుస్మృత్యాదులు కూడ, యనాదిగ లోహమునుగూర్చి భరతదేశస్థులగువారికి తెలిసియుండునని తేలుచున్నది

ఇనుము భూమినుండి త్రవ్వి ఎత్తబడును అట్టి గనులు ప్రపంచమునందు తఱుచుగ గలవు. ఇంగ్లాండునందు ఇనుప గనులు, రాతిబొగ్గు గనులును గాడ సమీపములుగ గల్గియుంటచేసి, ఇనుము గరగించు కర్మాగారములు పెక్కులుగ నేర్పడినవి. భరతదేశమున ఇనుపగను లున్నను కరగించు కర్మాగారములు తగినన్ని లేవు. ఆంధ్రదేశమునను పెక్కుచోట్ల ఇనుపగనులు కలవు. త్రవ్వబడిన ఇనుమును Manganese ore అందరు. ఇనుము యొక్క గట్టి సుప్రసిద్ధముగాన సామెతలుగ వాడుదురు

Iron cross అను బహుమానము తొలుత ప్రష్యాదేశమున నుండెను. దాని నాంగ్ల ప్రభుత్వమువారును అవలంబించిరి. ఇది సివిలియను ఉద్యోగులకు సైన్యమందలి యుద్ధవీరులకు బహుమానముగ నీయఁబడు వెండిఅంచులుగల ఇనుప క్రాసు (Cross) అయి యున్నది. దీని నతిశయ గౌరవచిహ్నముగ నెంతురు. గత ప్రపంచయుద్ధమున విరివిగ పంచిపెట్టఁబడినది. క్రొత్తగ పగుల గొట్టఁబడిన ఇనుమురంగును ఆంగ్లమున Iron grey colour అనెదరు.

న్యూజిలండు దేశమునను, భరత దేశమున కొన్నిగనులందునను ఇనుము అతిచిన్నముక్కలుగ నిసుకతో కలసి దొరకెడిని. దీనికి ఇనుపఇసుక (Iron sand) అని పేరు. ఇనుము పెద్దముక్కలుగ రాళ్లంబోలె దొరకు సందునకు ఇనుపరాయి (Iron stone) అని పేరు. ఇంగ్లాండునందు యార్కుషైరుసీమయందు క్లెవ్‌లాండు మండలమున దొరకు ఇనుము పెద్దపెద్ద రాళ్లవలెనుండెడిని. ఇంకా ఎక్కువ Phosphorous ఉండునని కనిపెట్టఁబడినది. స్వీడన్ దేశమున లభించు ఇనుము ఉక్కు చేయుటకు ప్రశస్తమైనదిగ గనిపెట్టఁబడినది. ఇనుమునుండి లభించు ప్రత్యేక పదార్థములు ఇనుపత్రుప్పు, ఇనుపచిట్టము, ఉక్కు నై యున్నవి. ఇనుమును పృథివ్యాపస్తేజోవాయురాకాశములను పంచభూతములకు అందిచ్చిన దానియందు త్రుప్పుపట్టును. ఇంకను సముద్రపుఉప్పుగాలి, చవిటినేలల ఉప్పు తాకుటలం గల్గినదిఅమేని అతివేగముగ త్రుప్పుపట్టి అసలుఇనుమును తినివేయును. ఇనుమును గాల్చుట, కాల్చి సాగించుటవలన ఇనుమునుండి కరగి జారి చిట్టము నేలం బడిపోవును. ఇది ఇనుము ఉపయోగించునటుల ఏ పరికరములకు చిట్టము పనికిరానిదని తలంపఁబడుచున్నది. ఇంక ఇనుమునందు కార్బన్ భాగములు గల్పిన నుక్కు అగును. ఇవి మూడును ఇనుమునకు ముఖ్యములగు నుపలోహములు (By products) అనఁబడుచున్నవి. అందు ఉక్కు ఎక్కువపనుల కుపయోగించునది

ఇనుపత్రుప్పు — ఆంగ్లి Rust of iron. ఆయుర్వేదవైద్యులు ఇనపత్రుప్పును మెత్తగ చూర్ణముఁ జేసి గోమూత్రములో పూసి తడిపి (పదునేను లేక ఇరువది దినములలో నెండనట్లు) ఎండించి లోనికిచ్చియు పైకి రాచియు, ఉపయోగింతురు. పుట్టవ్రణము (సెలలువేయు

అన్నిటికి నతిశయించియుండును కొల్లింట ఇనుముతో కొనలను సాధులను భద్రపర్చబడు ఓడలికాలమున నుక్కుతో భద్రపర్చబడు చున్నవి అందునను ఉక్కు జాతియు దానికిగల పదనును మిగుల పటిష్ఠలతో నతిగ్రతగ సమర్పించబడుట ఆరోగ్యదాతగనుండ ప్రదర్శించుట మాత్ర ముచ్చటగ నుండును ఉక్కుతో చేయబడు కత్తులలో నెక్కువ తెలివ దారు లోహము యొక్క స్వచ్ఛత పరిశుభ్రతల సమానముగ గల్గియుండు కత్తిని చంద్రాయుధమందురు ఇందు చిట్టము మొదలగు లోహపుముక్కియు, తుప్పు మొదలగు లోహకళంకము నుండకుండును అనగా స్వచ్ఛతగల్గి యుండునని భావము ఇటులనే ఇంక Tungsten, Chromium, Manganese Nickel Vanadium మొదలగు లోహభేదములు నిట్టివియే Tungsten తో కల్పబడి పదనిపెట్టబడిన ఉక్కుతో యంత్రపు పనిముట్లు చేయబడును ఇవి ఎంతగట్టిగనైన పనిచేయుటగాక యెట్టిగ గాలి లోహముపై తాకి పనిచేయుచున్నను, దానికిపదను పోక గోల్పోవక నిలువబడియుండును రేకులు మొదలగునవి చేయబడు మెత్తని ఉక్కునందు కార్బన్ కలియును దూలములు మొదలగునవి చేయు ఉక్కు మధ్యరకముది ఇందు కార్బన్నాలు కొంత ఎక్కువగనుండును నరకు పనిముట్లు, ఆకురాళ్ళు కత్తులు మొదలగునవి కఠినమగు ఉక్కు ఇందు కార్బన్‌పాలధికమైయుండుటయేగాక గంధకము, బిగువు, ఇతరకూడికలు కూడ చేరియుండును

ఆయుర్వేద వైద్యులు ఉక్కును భస్మముగను, సింధూరముగను చేసి వాడుదురు

ఇది శరీరమున క్రొత్తరక్తము బుట్టించి పరిశుభ్ర రక్తముం గల్గించుననియు, సర్పవిషము హరించి శ్వేతకుష్టువు మహాకుష్టువుల నివారించు ననియు, సమస్త జ్వరముల నివారించి వీర్యపుష్టి బలము గల్గించు నియు ఆమవాతము, ఉబ్బు జాడ్యము గ్రహణి, గుల్మము, ప్రమేహము, పాండువు, ప్లీహ పైత్యోద్రేకము, దగ్గులు, ధాతుక్షీణత, శరీర క్షీణత, శరీరస్థూల్యము శరీర కార్శ్యము రక్తవికారము వరిఘనితము, శ్వాసలు నివారించుననియు జెప్పబడినది

ఇనుము ఉక్కుల రాపిడిగుడా బాణాసంచా (అందు ముఖ్యముగ కాకరపూవత్తుల క్రిందికి రాలు పూవు లుగాను) యందు చేర్చబడును

**ఇనుముకరిగే కొలిమిలో ఈగల కేముండును?** — ఆంధ్ర లోకోక్తి

**ఇనుముతోచేరినకతన అగ్నిహోత్రునకుగూడ సమ్మెటపెట్లు** — ఇనుమును ఎరగ కాల్చి సాగగొట్టెదరు అట్టితరి సమ్మెటదెబ్బలు అగ్నికి గూడ తగులునని భావము ఆంధ్రలోకోక్తి

**ఇనుమువిరిగితే అతకవచ్చుంగాని మనస్సువిరిగితే అతకదు** — ఆంధ్ర లోకోక్తి

**ఇన్ కన్వర్టబుల్ పేపర్** — వాణిజ్య వ్యవహారపరిభాషా పదము Inconvertible Paper Currency కావలసినతోడనే నాణెములుగా మార్చుటకు వీలుగాని నోట్లు మొదలగు కాగితపు సొమ్మును ఎక్కువ డిస్కౌంటుకు బజారునందడిగెదరు అట్టివాని కీపేరు వర్తించును

**ఇన్సల్టు టు ఇంజరీ**— ఇం Adding insult to injury ఇదివరకే అపాయమొనర్చి నష్టమో బాధయో గల్గించియు డి పిదప వంచన మాటలాడి మనోవేదన గల్గించుట యనిభావము

**ఇన్గాడ్వయి ట్రస్టు చిహ్నము** (In God we Trust) —అమెరికా సంయుక్త రాష్ట్రము వెండి, బంగారపు పెద్దనాణెములపై

సిమాటలుగాకుట గాననగును. అనగా దేవుని యందు నమ్మకము అని యర్థము. ఇట నమ్మక మన యాధారపడుట యను భావము స్ఫురించు చునేయున్నది క్రీ. శ. 1861 మొదలు 1865 వరకు పెన్సిల్వేనియా గవర్నరుగ నుండిన James Pollock గారు భక్తుడు గాన అప్పుడు దేశమునందు వ్యాపించియున్న Civil War కలతలందు దైవసహాయముకర్థించి ట్రెజరీ సెక్రెటరీగారికి వ్రాయుచు "Recognition of God on national coinage is a national duty" అని వివరించి పైవాక్యమును సంయుక్తరాష్ట్ర ముద్రికలపై వేయుబడుటకు సలహానిచ్చిరి దీనిని కాంగ్రెసువారంగీకరించి పక్షస్వీయముగ కొక శాసనమొనర్చిరి ఇది రెండు సభల యామోదముబడసి దీని Motto గా గ్రహించిరి. అది మొట్టమొదట క్రీ. శ. 1864 లో ప్రచారము నొందెను

**ఇన్వార్ లోహము** (Invar) — ఇది కలుపుగు లోహాము ముఖ్యమైనవి ఇందు ఉక్కు, నికెల్, కార్బనులు ప్రధా ద్రవ్యములు ఈ కలుపుగు లోహాము వేడికి విజృంభించుట యందు చాల తక్కువ పరిమితి (Low Coefficient of Expansion) కలదిగాన కొలుచు కునే Metal Tapes మొదలగునవి చేయువారు విస్తారముగ వాడుచున్నారు

**ఇన్‌క్లినోమీటర్** (Inclinometer)- ఇది త్రివిధ భేదములు గల్గిన కొలత పరికరము. పైనుండి క్రిందికి పల్లముగనైన తావులందలి Magnetic force ను కొలచు పరికరమునకును, క్షితిజమునకు గలుగు యుండు మూలల (Angles) కొలచు పరికరమునకును, థియోడొలైటు యంత్రమును దగిలించుచు కొలచు పరికరమునకును ఈపేరు కలదు.

**ఇన్నిస్ఫెయిల్** (Innisfail) — ఇది ఐర్లాండు ద్వీపమునకు కవిత్వమునందు వాడబడిన పేరు. Isle of Destiny అని యర్థము.

**ఇన్ఫీరియర్ ప్లానెట్సు** (Inferior Planets) ఎస్ట్రానామీ శాస్త్రమునందు సూర్యుని నుండి భూమికన్న దగ్గరగా తిరుగు గోళములకు పేరు అని మెర్క్యూరీ, వీనస్సు అనంబడునవి తక్కినవి సుపీరియరు గోళములు (చూడుడు)

**ఇన్సూరెన్సు** (Insurance) — తరుణగ నిన్సూరెన్సు, ఎస్యూరెన్సుల కొరకే సంస్థగా భావించి పొందబడుచుండును ఇన్సూరెన్సు భవనములు, యంత్రశాలలు, గిడ్డంగులు (Godowns) మొదలగువానిని అగ్ని మొద లగు ప్రమాదములు గల్గునపో వానిని ఇన్సూరు చేసియున్న యెడల అట్లు చేసి సంస్థ వారింత సొమ్మిచ్చుకొనుటకు నేర్పాటై యుండును. మరియు తామాసంస్థవారికి కొంతసొమ్ము వాయిదాలకుర కేటట్లు చెల్లించుచు నుటగును ఏర్పా టైయుండును ఇంకను ఇట్టి . ర్పాటు మోటారు బాక్సులకును చేయించి అపాయము గల్గినచో కొంతసొమ్ము సవవారిమ్మంపద్ధతియు గలదు ఎవిపాయములు రాకుండినచో కట్టినకట్టుబళ్ళ సొమ్ము తయ ఇచ్చునకంపెనీ సంస్థకే దక్కును. ఎస్యూరెన్సు మనుష్యుల జీవితములపై చేయుం బడునది (ఎస్యూరెన్సు చూడుడు)

**ఇన్ఫ్లూయెంజా జ్వరము** — Influenza అతిత్వరితముగా నితరులకంటి వ్యాపించు జ్వరము 16వ శతాబ్ద కాలము నుండి ఎరిగిన రోగము. తగిలినచో నాప్రాంతము లందు గొప్ప వ్యాపకముగాంచునది సంపర్కము గల్గిన ఇరువదినాల్గు గంటలలో జ్వరము తగులును. బహుళః రొంపయు, చలి, వణకు లక్షణములు, 102 లేక 103 డిగ్రీల జ్వరముండును.

ఏదిక్కులు లేకుండినలరి త్వరితముగా మూడు రోజులలో నివారణమై యారోగ్యము కల్గును Complications కల్గి Lungs effect మై న్యూమోనియా, పెన్యూమోనియాలు కల్గిన ప్రాణాపాయము కూడఁగల్గించును

రోగి విశ్రాంతిగా పరుండుటయు, చులకని యాహారమిచ్చుటయు, విరేచన బద్ధము గలుగ కుండ చూచుకొనుచుండుటయు ప్రధానములు టెంపరేచర్ నార్మలుకు వచ్చి పిదపగూడ నీవిధులు ఆచరణీయములు ఈ వ్యాధి క్రీ. శ. ౧౮౮౧ లో చీనాదేశమున బయలుదేరెనట ౧౮౮౯ లో స్పానియా దేశమున దగుపడి యిరోపా యంతటం బ్రాకి ఖాడా తరములకుంగూడ నాటి భరతదేశమునగూడ నగుపడెను ఆ సంవత్సరమున జూన్ నెలలో తొలుత బొంబాయి లో ప్రారంభమై దేశమంతటను పల్లెటూళ్లకు గూడ నగబ్రాకి వేధించెను ఇది అన్ని వయస్సుల వారికింగూడ నొకేతీరుగ నుండుననియు, పిల్లల కంటె వయస్సు మీరినవారి కెక్కువగా నుండు ననియు వేసవికంటె శీతకాలమున నుధృతముగ నుండుననియు పరిశీలన లొనర్చిన వైద్యసంఘము వారు నివేదించిరి. ఈసూక్ష్మజీవింగూర్చి రూఢిగా నెవ్వరును తెల్పియుండలేదు Pfeiffer అను పేరుగల వైద్యుండు పరిశీలనలొనర్చి కణికను కాలియుండునని తెల్పియున్నాడు. ఎండ యందిది నిలువలేక చచ్చునట శరీరము నందభివృద్ధి నొందునటుల పలుపలవృద్ధినొంది చిరకాలము మనజాలదట

రోగి ముక్కునుండి, ఊపిరితిత్తులనుండి వెలువడు ద్రవమునందు, రోగి నవ్వునప్పుడు, దగ్గునప్పుడు, మాటలాడునప్పుడు గాలిలోనికి తుంపురులగుండా చేరి అన్యులకుం వ్యాపించునుగాన పోటాపీయం పెర్మాంగనేటుగాని, ఉబిలు సాల్టు గాని వేడినీటం గరిగించి పుక్కిలించుచు నుండుయు చుండఁదగునని కొందరు వైద్యులనెదరు (అంటు వ్యాధులు, సూక్ష్మజీవులు జ్వరము చూడుఁడు)

**ఇన్స్పిరేషనిజమ్**— (Inspirationism) ఎగ్రంథముగాని యైనను ప్రతిమాటయు దైవదత్తమనియు ఆవేశమువలననే కల్గినదనియు నమ్మువారి మతాభిప్రాయము

**ఇన్స్పెక్టింగు ఆర్డరు** — వాణిజ్య సంబంధ పరిభాషాపదము Inspecting order Dock నందు, Bonded Warehouse నందు మొదలగు తావులందుగల సరకులం దనిఖీచేయు నధికారమునిచ్చుచు నొసంగిన యుత్తరువు

**ఇన్వేలిడిజమ్** — (Invalidism) అశక్తతవలన తాటస్థ్యము వహించు (దేవికిని గల్గించుకొనిన) వారి మతము

**ఇన్స్క్రైబ్డు స్టాకు**— వాణిజ్య సంబంధ పరిభాషాపదము Inscribed stock కొందరికి సాముదాయికముగ నున్న సరకు. దాని యజమాను లందరు రిజిస్టరు చేయుబడుగ రేకాని సరకుతో నేసంబంధము గల్పించుకొనరాదు సంఘము వారధికార మిచ్చినవారు మాత్రమే దాని గొనుగోలు మొదలగుపనులం నెరపుదురు

**ఇన్సొల్యూబిల్కలర్సు**— (Insoluble Colours) రంగులు. రంగులు చూడుఁడు

**ఇప్పచెట్టు** — లా Bassia longifolia లేక Latifolla ఆంగ్ల Indian butter tree సం మధూక, మధుపుష్ప, మధుష్ఠీల హిందీ, మోవా, లేక మహువాష్ ఇది అనేక విధోపయోగములు గలవృక్షము అడవివృక్షము, ఇప్పపువ్వు, ఇప్పకాయలలోని గింజల నూనెయు, ఇప్పసారాయము ఉపయోగకరములే

ఇప్పనూనె పైత్యవాతములనడంచి చలువ చేసి యెంట్రుకలకు బలము, పుష్టినిచ్చును. ఇంచుక

శ్లేష్మమును జేయునందురు క్రిమిరోగములు, వాపులు దరదలు, వ్రణములు పైపూతలచే తగ్గును. ఇప్పకాయలు కూరగ నొనర్చి పుచ్చుకొనిన వీర్యము కు చలువ జేసి ఇంచుక విరేచన బద్ధముగల్గించి ఆమదోషము నుద్రేకించును కఫము, పైత్యము న్ మేహము, వాతముల నడచును ఇప్పపండ్లు చలువ సి దేహపుష్టి నొ వా పైత్యముల శమనం జేయును ఇప్పపువ్వు పైగుణములను బలముగ కొనర్చు ది దీనికి విరుగుడులు ధనియాలు, వేపవిత్తులు, నెయ్యి వేడి

**ఇమాదువంశనృపులు** — బహమనీరాజ్యము క్రీ వె ర్లో నైకు చిన్నరాజ్యములుగ చీలుటతో నేర్పడిన రాజ్యము లలో నొకటయగు బీరారు రాజ్యమ నేలిన ముస ల్మాను నృపులు

**ఇమాన్షు సేన్ మహాత్మునిగోరీ** — ఇది చెనపోలెని యాయంగ రాకె ములేస్వ నంటయు తూర్పుగ ను కరాలాపురము దద్ది కర్బాలాపురము మహమ్మదీ ముశాఖ లలో నొకశాఖవారికి యాత్రాస్థలము ఇమాన్ హుసేన్ మహాత్ముడు మహమ్మదుగారి దౌహి త్రుడు బలాత్కారమరణ మందినాడు

**ఇమామ్** — అరబ్బీ భాషాపదము నాయకుడని యర్థము. ఒకప్పుడు మహమ్మ దీయపాలకులగు కాలీఫలకు బిరుదుగా నుండి దట అరేబియాపరిపాలకులకుగూడ తరువాత బిరుదముగా నుండెనట. మసీదులం దిక్కాల మున ప్రార్థనాదులు జరపి నడపు నుద్యోగికి వర్తించుచున్నది.

**ఇమారీసామాను** — (Porcelain) జపానుదేశమున చేయంబడు సామాను. తెల్లమట్టి ఫెల్స్పతిక్కరాతిపొడుము మొదలగువానితో చేయంబడుచు, పోర్సిలైనుపేరం బరగుచున్నది. అందమై యుండును

తొలుత జపాను నందలి హిజాన్ సీమలో (అనగా నాగసాకిదేశమున) 1200 సంవత్సర ము కినిపెట్టబడి ప్రారంభమైనది మెరుగుగల్గి యుండును.

**ఇమిటేషన్ సిల్వర్** — (కృత్రిమ రజతము. ఈ క్రిందవివరింపబడిన లోహముల సమ్మేళనమువలన నిజమైన వెండివలె రంగును, తేటయు, తళుకుకుగల కృత్రిమ రజతలోహము (Imitation Silver) తయారగుచున్నది. రాగి 70 పాళ్ళు, నికెల్ 23 పాళ్ళు అల్యూమి నియమ్ 7 పాళ్ళు. కొంచెము వెలిగారము కలిపి మూసలోబెట్టి బొగ్గులకొలిమిలో కరగింప వచ్చును దీనిలో మరియొక భేదము రాగి 57 పాళ్ళు నికెల్ 20 పాళ్ళు తుత్తినాగము 20 పాళ్ళు అల్యూమినియమ్ 3 పాళ్ళు దీనిని కూడ మూసలో బొగ్గులకుంపటిమీద నే కరగింప వచ్చును లోహము మూసలో కరగి నీరయి పోవును ఇది మొదటిదానికన్న కొంచెము ఇత్తడితో సమానముగా కట్టును. దీని రంగు వెండిని మరపించి యుండును మిక్కిలి తేటగా మెరుగుపెట్టుటకు వలయునంత గట్టిదనము కలిగి యుండును

**ఇమేడియటిజమ్** (Immediatism) పొల్లి టికాలమున బానిసత్వము వ్యాపించి యుండుతరి 'తక్షణమే అందరు బానిసలను స్వేచ్ఛాపరులుగ జేసి తీరవలయు'నను అభిప్రా యము గల్గియుండినవారి పట్టుదల.

**ఇయూబోయియాద్వీపము** గ్రీసు దేశము చూడుడు.

కలసిననదిపై నున్న రేవుస్థానము. (ఖాల్డియా చూడుఁడు)

**ఇరాకీస్** — అమెరికాసంయుక్తరాష్ట్రములలోను, కనడాదేశములోను వసించుచుండు మొహావక్సు మొదలగు ఇండియనుజాతులకు అమెరికానివాసులిడిన పేరు.

**ఇరాన్ దేశము (పెర్శియా)** — పారశీకదేశమునకు ఆదేశపు స్వభాషానామము దీనినే ఆదేశప్రభుత్వమును విదేశప్రభుత్వములును వాడుచుందురు. కాకసస్ పర్వతములు, హిందూకుష్ పర్వతములు, పారశీక సంయుక్తాగ్రగుడము, ఖుర్దిస్థానము, టైగ్రిస్ నది దీనికి ఎల్లలని చెప్పఁబడినది. ఈదేశపు ప్రధాననగరమునకు థా-ఇరాన్ అని పేరు. అనగా ఇరాన్ నగరమని యర్థము దాని నాంగ్లమున టెహెరన్ అని పల్కుచున్నారు. (పారశీకదేశము చూడుఁడు. పాహ్లవదేశము చూడుఁడు).

**ఇరాన్ పాలి లిపి** — అశోకచక్రవర్తి (క్రీ పూ ౨౭౩—౨౩౧) పాటలీపుత్రము రాజధానిగ మగధరాజ్య మేలినవాఁడు. ఈ మహనీయుఁడు బౌద్ధధర్మములను భరతదేశమునందు పెక్కు ధర్మశాసనములుగ వేయించినవాఁడు. ఉత్తరమున హిమవన్నగము, దక్షిణమున మైసూరుప్రాంతసీమలు, తూర్పున వంగదేశము, పశ్చిమమున ఘూర్జరదేశము గల భూమియం దచ్చటచ్చట నీతని శిలాశాసనములు గానవచ్చుచుండును. అవి వాయువ్యదిశను (పశ్చిమోత్తర సరిహద్దు పరగణా) ఖరోష్ఠీలిపియందునను, తక్కిన ప్రాంతముల బ్రాహ్మి (దేవనాగరి) లిపియందునను, లిఖింపఁబడినవి (బ్రాహ్మిలిపి, ఖరోష్టిలిపి, భరతదేశమందలి లిపులు చూడుఁడు). రెండు లిపులు కలియు సంధిప్రదేశము పంజాబుదేశము నందలి జలంధరుజిల్లా. ఇచట నీలిపికి ఇరాన్పాలీ లిపియని యందురు అనగా రెంటిసంకరరూపమునకు ఇరాన్ పాలీయని పేరని తెలియుగునది. దీనికాంగ్లమున Ariano Pali అని పేరిడియున్నారు. శాసనములు పాలీభాష ధర్మశాసనములే వై యున్నవి.

**ఇరిగేషన్** (Irrigation Engineering)— వ్యవసాయపు పొలములకు ఎరువులు, నీటివసతి ముఖ్యము అందు నీటివసతి ఎక్కువ ప్రాముఖ్యమైనది వ్యవసాయములకు నీటివసతిఁగల్గించు పనులఁగూర్చిన శాస్త్రవిధానమున కాంగ్లమున Irrigation engineering అనిపేరు. ఇరిగేషన్ స్వాభావికమనియు (Natural), కృతకమనియు (Artificial) ద్వివిధము.

కేవల వర్షాధారముపై నాధారపడి పండించు పంటలస్థితి కాంగ్లమున Natural irrigation అనియెదరు ఇట్టిది కేవలము మెట్టపంటలకే యని చెప్పఁబడినను, వర్షాధిక్యముగల ప్రదేశము లాగ పల్లపు వ్యవసాయములగుచుంట గానవచ్చెడిని. ఇట్టి ప్రదేశములు ఇప్పటి మధ్యరాష్ట్ర (Central Provinces) భాగములందు గానవచ్చెడిని తక్కిన కృతక విధానము లిఫ్టు ఇరిగేషననియు, డైవర్షన్ ఇరిగేషననియు, స్టోరేజి ఇరిగేషననియు త్రివిధములుగఁ జెప్పఁబడినది ఏతములమూలమున నీటిం దోడిగాని, గూడవేసి నీటిం బారించిగాని, దోనెలతో నీటిం బైకెత్తి పారించిగాని Water lifts మూలమున నీటిబైకెత్తుచు పారించిగాని, నీటిపంపుల మూలమున నీటిందోడి పారించిగాని, ఈజిప్టుదేశపు మహాపులమూలమున నీటిం బారించిగాని పంటచేలకు నీటివసతిఁగూర్చు విధానమునకు లిఫ్టు (Lift) ఇరిగేషన్ అనియెదరు.

నదులకు ఆనకట్టలంగట్టి నీటిమట్టమును పంటపొలముల కనుకూలించునటుల నెత్తుచేసి

నిలిపి కాలువలందు ద్వారా యానీటిని పారించి పొలములకందిచ్చు విధానమునకు డైవర్షన్ విధానము (Divertion Works) అని పేరు. ఇంక నదీజలములు మొదలగు Natural Drainage ప్రవాహములను మరలించిగాని, కాలువలగుండా నీరు తెచ్చిగాని రిజర్వాయరు చెరువులందు (Reservoir Tanks) బంధించి నిలువచేసి దానిమూలమున పంటపొలములకు నీటివసతిం గూర్చుపద్ధతికి స్టోరేజివిధానము (Storage Works) అనిపేరు.

ఇర్రిగేషన్ ఏవిధానముచేతనైనను కాలవ్యతిరేకములు సంభవించి పంటపొలములందు నీరధికమైనచో నానీటిం గొంపోయి సముద్రమునకుంగాని, ఇతర జలప్రవాహములకుంగాని, పల్లపుప్రదేశములకుంగాని చేర్చుటకుం గొన్నితావులందు కాలువలుండెడిని వానికి మురుగు కాలువలని పేరు. రిజర్వాయరులనుండియు, పంటకాల్వలనుండియు నధికమగు జలములను పైకి వెడలించుటకు సర్‌ప్లస్‌వీర్సు, సర్‌ప్లస్‌స్లూసులు మొదలగు ఏర్పాటులు నిర్మింపఁబడును. ఇంక డైవర్షన్ విధానమునను, స్టోరేజివిధానమునను అవసరములగు కొన్ని నిర్మాణములు లక్ష్యస్థానములందు నిర్మింపఁబడి వాడుకొనఁబడుచున్నవి. వానింగూర్చి వానితావులందు చూడవగును. అవి- ౧ అక్విడక్టులు, ౨ ఆనకట్టలు, 3 ప్రసులు, ౪ గోడలు, ౫ టన్నెల్సు, ౬ ట్యూబ్సు, ౭ డ్రాప్సు, ౮ డాములు, ౯ డివైడింగుడ్రామ్సు, ౧౦ డ్యూటీ ఆఫ్ వాటర్‌వర్క్సు, ౧౧ ప్లడ్బ్యాంకులు, ౧౨ లాకులు, ౧3 వంతెనలు, ౧౪ సప్లైస్లూసు, ౧౫ సర్‌ప్లస్‌వర్క్సు, ౧౬ స్కవరింగుస్లూస్, ౧౭ సూపర్‌ప్యాసేజి, ౧౮ సైఫనులు, ౧౯ హెడ్‌స్లూస్ మొదలగునవి.

**ఇరిడెంటు సంఘము** — ఇటలీదేశము తిరుగ రాజ్యమై రాజు నేర్పాటుచేయు వరకు ఇటాలియను ప్రజలు నివసించు కొన్ని తావులారాజ్యమున చేర్పబడక వేఱుగనుండవలసి వచ్చెనట. ఆప్రదేశముల నిటలీరాజ్యమునకుం జేర్పుటకీయుద్యమము ప్రారంభమై అందలి సభ్యులకు ఇటాలియన్ ఇరిడెంటిస్టు అనిపేరుకల్గెనట. పిదప క్రీ. శ. ౧౯౨౦ సంవత్సరమునాటికి వీరి ఉద్యమము సఫలమాయెనట. వీరియరపు ఇటాలియా ఇరిడెంటాయని యుండెనట.

**ఇరిడియం లోహము** — ఇది Metallic Element అని చెప్పఁబడినది. దీని Chemical Symbol, Ir Atomic weight 193 1, Atomic Number 77, Specific Gravity 22 40, Melting point సెంటిగ్రేడు థర్మోమీటర్ రెండువేల డిగ్రీలని చెప్పఁబడినది. ఇది ప్లాటినమ్ రిఫైనుచేయుటయందు ఇది యొక By-product గా చేయఁబడుచున్న లోహము. మెరుగుగల తెల్లలోహము. ఉక్కువలెనుండి అధికతరమగు కఠినతగలది. వాతావరణపు దోషములను కెమికల్ దోషములకు చెడనిది. అధిక వాడుక కాగగల లోహము ఫౌంటెన్‌పేనాల పాళీల కొనలందు వాడఁబడుచుండును.

**ఇరుగుడు చెట్టు** — లా. Dalbergia Sissoo ఆంగ్ల. Sisu Tree సం. కృష్ణసార, శింశప. ఈ చెట్టుచేవ మ్రానికర్ర నల్లగ గట్టిగనుండి వడ్రపుపనికిచాల నుపకరించును. కొందఱు దీనిని రక్తచందనమనియు నందురు. ఈమ్రానిచెక్కయొక్క రసము, కషాయములు, వేడిచేసి కుష్టు, క్రిములు, పైత్తికదుష్టులోని రోగములు, తాపము, మేహము, మచ్చలు, వాంతుల నడంచును. గర్భస్రావము గల్గించును. అగరు, దేవదారు, బొంతచెముడు, మామిడి, ఇరుగుడు చెక్కలరసములు సమభాగములుగ గల్పి నూనెతోఁ జేర్చి వండినసూనెను ఇరుగుడు

**ఇల్లు కాలుతూంది జంగమయ్యా అంటే, నాచంక జోలెయు నాచేతి గంటయు నాకడనే యున్నవన్నట్లు** — ఆంధ్రలోకోక్తి.

**ఇల్లువిప్పి పందిరివేచినట్లు** — ఆంధ్ర లోకోక్తి

**ఇల్లెక్కి కొరవిఁద్రిప్పినట్టు** — ఆంధ్రలోకోక్తి

**ఇశ్రాయేలులు**— ఇర్లులు చూడుఁడు

**ఇసింటారమ్మంటే ఇల్లంతా నాదే అనేవాఁడు** — అనగా ఉపకారికి అపకార ము చేసేవాడని భావము ( రాజపసుఁడు) ఆంధ్ర లోకోక్తి

**ఇషీకహస్త గోత్రము** — పరాశర గణము చూడుఁడు

**ఇషుకారన్యాయము** — ధనస్సులు చేయువాడని యర్థము ఇతరులు కలంచ మా స్సును పోనీయక బాగ చిత్తము తానవలబె చిన పని చేయుచూడుట యని భావము

**ఇషుపకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుఁడు) ఇషుపకులగోత్రము, ఏకార్షేయ గోత్రము (౪—) దీనిని ఇసపకుల జాతులగోత్ర మనియు నందురు నాస్కృతగోత్రము, గృత్స్న మదస గృత్స్నమదగణము, విష్ణువృద్ధర్షి, ఆప స్థంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథ ములు, ధర్మసింధు నిర్ణయసింధు, సమానగోత్ర ములు కృత్స్నస, విష్ణువృద్ధస, కపిలేశుఁడు దేవత, భార్య కపిలాంబ, నర్మదాతీరము తపస్థానము, కపిలాంబుధితటాకము, జపము కోటి,దీపములు ౬౩, క్షేత్రసంఖ్య ౧౧, షోడశమహాదానములు, ఇంగువ వర్జనీయము

**ఇషుమంతుఁడు** — యదువంశ క్షత్రి యుఁడు వసుదేవుని తమ్ముఁడగు దేవశ్రవుని రెండవ పుత్రుఁడు

**ఇషువేగక్షయ న్యాయము** — ధనస్సునుండి (బలముతోఁగొడి) వదలబడిన శర వేగము రానురాను తగ్గిపోవు నని యర్థము.

బాణమునుండి వదలఁబడిన శరము బాణపు నారిబిగువు బలము నుండి కొంత త్వరితగమన సామర్థ్యము నొసంగఁబడిన దగుట తెలమే అట్టి శరవేగము సైతము పోను పోను తగ్గిపోవుచు డుం నని భావము.

కాలానుగతమైన (బలక్షీణత) పటిమ క్షీణిం చుట కీన్యాయము వర్తించెడిని

**ఇష్యమాణస్యైవప్రాధాన్యం నత్విచ్ఛాయాః ఇతిన్యాయము** — కోర్కె కంటె కోరినపదార్థము చాలా ముఖ్యమైన దని భావము.

**ఇసుక** — రాళ్లు పిండౌటి కొరచమకుని దైన మాణ్ణము నిసుకయని పేరు ఇసుకరేణు వులు పెద్దవియైనను చిన్నవియైనను, చిన్నత్రస రేణువులైనను రాతిపొడియె ఈరాతిపొడి పర్వత సీను ందైనను, సెలయేరు, వాగు, నదులాదై నను నీటిప్రవాహవేగము రాళ్ల దొరలుచు కొండకొకటిపైం బడి చితికి ముక్కలై పొడి యై వి ఇసుక యగును ఇవ్యవి తెల్లరంగుగ, ల్లరంగుగ, ఇ చుక ఎఱ్ఱధాతువుం గల్గిన లుపు తెలుపులు గలిపిన రంగులుగ నుండెడిని ఇందు నల్లఇసుకయును ముతుకఇసుక యుండను నల్ల ఇసుక చాలాసన్నముగ నుండును అద్దుడుకాగి తముల నెఱుఁగనికాలమున సిరాతోవ్రాసి దానిపై నల్లఇసుకం జల్లుచుండెడి యాచార ముండెను గాన సిరాబుడ్లతోసహా ఒక నల్లఇసుకబుడ్డియు దానిపై భాగమున చిన్న చిన్న రంధ్రములును

ఉండుట నంద తెలియగినదే. తెల్లని ఇసుకయందు ముతుకయిసుకయు, సన్నపుటిసుకయుం గూడ నుండెడిని. ముతుకయిసుకను గండ్ర ఇసుకయనియు నందురు. తెల్లయిసుక సర్వసామాన్యముగ నదులందు, సముద్రతీరములందు, ఎడారులందు, బయళ్ల యందు కూడ గానవచ్చెడిని. ఇదియె సర్వసాధారణపు టిసుక.

ఇంక నెఱ్ఱగా నీగండ్ర యిసుకకు చక్కని విలువ గలదు. ఎలాగన ఇది కరుకులేక చాలమెత్తగ నుండి బంగారు వెండివస్తువులకు మెరుగుపెట్టను పయోగించెడిని. దీనిని మెరుగు యిసుక యనియు, కురంజియిసుక యనియుం గూడ వాడుదురు. ఇది దొరకుతావుల శుభ్రపర్చబడి ఎగుమతిచేయబడుచు, అంగడులందు చిక్కెడిని. ఇంక నీకురంజియిసుకంబోలి సన్నయిసుక చాలా అరుదుగ గన్పట్టెడిని. కురంజయిసుక చకుముకిరాయి (Flint) సంబంధము గలది. ఆంగ్లపరిశీలకుల యిసుక Flint లేక Quartz రాళ్ళుగుండ యునదగు కందిపొడిరాయి (Sand Stone) గుండయుం గూడ నుండెడిని తోచక పోగ కొన్నిరాళ్ళుగుడయుం గానగుమనే యుండును.

ఇసుకయొక్క ఉపయోగము లెన్నియోగలవు. ఇసుకనేలలందు సరుగుడుతోటలు, జీడిమామిడి తోటలు, కొబ్బరితోటలు, ఖర్జూరపుతోటలు, ఇతర పరిస్థితులు ప్రతికూలింపనిచో నాటిన పెరుగును. ఇసుకను గోనెసంచులలో నింపి యుద్ధరంగమున రక్షణకై యడ్డుగవైచి యుపయోగింతురు. వంతెనలంగట్టు శిల్పశాస్త్రవేత్తలు, ఇసుకబస్తాలచే ప్రవాహపు అపాయముల నాపుదురు. ఇండ్లు కట్టుటకు సున్నము దంపుటకు ఇసుకపాలందు చేర్చబడును. నునుపుచేయు కాగితము (Sand papers) లిసుక నంటించి చేయబడినవి. అద్దములు చేయుటకు నిసుక చేర్చబడెడిని. విగ్రహములు చేయు మూసలకిసుక యవసరము. ఇంక నెన్నియో ఉపయోగములు కలవు. ఉత్తరఆఫ్రికా ఖండమునను ఆసియాఖండపుమధ్యభాగమునను, ఆస్ట్రేలియాయందును, ఇంక నరేబియాదేశమునందు, బెల్జియమ్ దేశమునను ఎన్నియో ఇసుకఎడారులు కలవు. ఆ దేశమున నదీతీరములనుండు పంట భూములు గాలికి యిసుకమయము లైపోకుండ నదీతీరముల సరుగుడుచెట్లను నాటి ఆపుదురు. మంచు విస్తారము పడు చలిదేశములందు, ఇనుపబాట మార్గమున బరువైన ప్రతి రైల్వే ఎంజినును కొన్ని ఇసుకపెట్టెలం దగల్చుకొని యేగును. మంచు పడి ఇనుపపట్టీలు బురదవలె జారుచున్నని వానిపై నీ యిసుకం గొట్టములగుండా కార్చుచు బర్విడుట. ఇక్కాలమున ఇసుకం ద్రవ్వి తీసివేయవలసివచ్చునేని ఒక Centrefugal sand pump నుపయోగించి తీసివైచెదరు. ఇది తడి ఇసుక దీర్చివేయును.

**ఇసుకగడియారము** — రెండు గాజు బుడ్లవలె నుండుచు రెంటింగలుపుచు నడుమ నొక సన్నని గొట్టముంగల్గియుండు గాజుపనిముట్టునకు ఇసుకగడియారమని పేరు. తొల్లింటికాలమున గడియారములు లేనితరి నిది వాడుకయందుండెను. ఒకబుడ్డియందు సన్ననిఇసుక పోయబడి పైకి త్రిప్పబడియుంట నాగొట్టముద్వారా క్రిందిబుడ్డిలోనికి ఇసుక యంతయు కారిపోవువరకు గడియయో గంటయో అగుచుండునటుల ఇది చేయబడుచుండెడిది. అక్కాలమున కొన్నితావులందు నీరు ఇటులనే కారుచు కాలముందెల్పునట్టి నీటిగడియారములును ఉండినవి. కాని ఇసుకగడియారములను త్రిప్పవైచుచుంటయు, నీటి గడియారములందు తిరుగ నీరునింపుచుంటయు చేయబడుచునే యుండవలసియుండెను.

**ఇసుకతక్కిడగానికి వేడతక్కిడగాడు** — ఆంధ్రలోకోక్తి

**ఇసుకతుపాను** (Sand Storm) — ఎడారులలో దప్పుడప్పుడు వీచు గొప్ప చండమగు సుడిగాలులు మిక్కిలిగనుండు ఇసుకలోని సన్నని త్రసరేణువుల నెగురవైచి పైకెత్తుకొనిపోవుచుండుటచే నాయిసుక మేఘములవలె దట్టమై కరిచమగు సూర్యరశ్మిని మరుగుపడఁజేయుచుండును ఆయిసుక నేలంబడుచో సర్వము వేడియిసుకచే దహింపబడుట యగుటయు, అసౌఖ్యము గల్గించుటయు, పిదప జీగటవిరేచనములం గల్గించి బాధించుటయు మార్గస్థులకు సంభవించుచుండును

**ఇసుకదారి చెట్టు** — ఇసుకరాసి కూరచెట్టు చూడుము

**ఇసుకదాసరిచెట్టు** — ఇసుకరాసికూర చూడుము.

**ఇసుకరాసి కూరచెట్టు** (ఇసుకదాసరి, ఇసుకరాసి కూర ఇసుకదారి) — లా Gisekia Pharmacioides దీనిని కొందఱు కూరగ జేయుదురు దీని రసమును, కషాయమును మూత్రకృచ్ఛము, మూత్రాశ్మరి మూలశంఖవ్యాధి వీనిని హరించి తేటనిచ్చి అనులోమవాతమును గల్గించును కూర చలువజయును

**ఇసుకలో నుయ్యిత్రవ్వుటయందు ఒడ్లు (అంచులు) కూలక మానవు**— ఆంధ్రలోకోక్తి

**ఇసోథెరం** — ఇసోబార్ చూడుము

**ఇసోబార్, ఇసోహ్యెట్, ఇసోథెరం** (Isobar, Isohyet, Isotherm) — గాలి యొక్క ఒత్తిడి (Air pressure) గాలి వీచుటకెట్టి ప్రధానకారణముగునో, గాలి వీచుటకూడ వర్షమునకట్లే ప్రధానకారణముగాన నీమూటికి నవినాభావసంబంధము కలదు

ఇసోబార్ అన సమానమైన వాతావరణపుటొత్తిడిగల తావులపై నుండిగీయఁబడు లేక భావింపఁబడు గీత. ఇది భూమిపై నున్నటుల భావింపఁబడుచు పటములపై నిజముగనే గీయఁబడు ఇట్టి ఇసోబారులు కొన్ని వార్తాపత్రికల దినాలయందు గానవచ్చుచుండు వాతావరణపు ఎక్కువ ఒత్తిడి తక్కువఒత్తిడి గాలివీచుదెసలను (Wind direction) తెల్పెడిని

ఇవి సముద్రపుసీటిచుట్టపు ఇసోబారులు, ఏలనన నివి బెరామీటరు రీడింగులు తెలియు గాన ఆ రీడింగులు సముద్రపునీటిమట్టముపై నెంత ఎత్తునయుండునో దానికి వేయి అడుగులకొక అంగుళముమేరకు తేడాను బెరామీటరు రీడి గులకు చేర్చి కల్పుటవలన నేర్పడినవి

ఈ బెరామీటరు రీడి గులు భూమియొక్క ఉత్తరగోళార్ధము నకన్న దక్షిణ గోళార్ధమునందెరు వ నిమ్నముగ నుండుని వా గావరణ శాస్త్రజ్ఞులు తల మమన్నారు భూమధ్యరేఖకును దక్షిణము Tropic of Capricorn వాఁకకు దక్షిణముగా నొక High pressure belt దీని ఒత్తిడి సముద్రముపై నధికముగను భూమిపై నవో నించుక తగ్గియుండునని కనిపెట్టబడినది

పిదపం జెప్పవలసిన ఇసోహ్యెట్లు గీతలు వర్షపాతముం దెల్పుతావులను పటములపై గీయబడియుండుగీతలు ఇవియు ఇసోబార్గీతలంబోలి అధికవర్షములు గురియు తావులను, అల్పవర్షపాతస్థలములను వివరించెడిని ఇవి సముద్రతీరముతో సరిసమానము (Parallel) గా నుండుననియు, సముద్రమువైపు వర్షాధిక్యమును భూమివైపు పోనుపోను క్రమముగ వర్షముతక్కువయుంగల్గియుండునని పరిశీలనవలన తేలినది.

ఇంకను ఎత్తగు పర్వతములున్నచో నా పర్వత పఙ్క్తియొక్క సముద్రపువైపు ప్రక్కను వర్షాధిక్యమును, అవ్వలిప్రక్కను తక్కువవర్షములును గల్గును.

ఇంకందక్కిన ఇసోథరముగీతలు శీతోష్ణస్థితులంబట్టి గీయఁబడునవి. ఇవి నెలవారీ మీన్ చూపకేచరుంబట్టి గీయఁబడుచుండును. శీతోష్ణస్థితులు Maximum అనియు Minimum గను రెండువిధములుగ దీయఁబడి, వీని ఏవరేజి సముద్రపుసీమట్టము నుండి ఆ తీయఁబడిన ప్రదేశము ఎత్తునకు నో దానికి నూరడుగులఎత్తున కొక డిగ్రీ (ఫారెన్హైట్ థర్మామీటరు) ప్రాప్తికి ననుసరించి రీడింగునకుం జేర్పంబడి ఆమొత్తము మేరకు స్థలనిర్ణయములో నేర్పంబడి ఈగీతలు గీయఁబడుచుండును (వెదర్ఫోరుకేస్టు ప్రాయుటకు బారామీటరు రీడింగుచూడుఁడు. సముద్రపుసీమట్టము చూడుఁడు. ఫారెన్హైట్ థర్మామీటరు శీతోష్ణములం గొలుచు యంత్రము చూడుఁడు)

**ఇసొమెరిడీస్** (Isomerides) — కెమిస్ట్రీ (రసాయనశాస్త్రమున) "Same elements in same proportions to form different compounds" అని వివరించియున్నారు

ఉదాహరణముగ Ethyl alcohol, Methyl అనంబడు రెంటికిని C2 H3 O అను Formula (ప్రమాణము) కలదు. ఐనను అవి రెండును వేర్వేఱు పదార్థములుగా చెప్పఁబడినవి భేదము Atoms యొక్క భేదముగు పర్పాటునందు కలదు. ఇట్టి వానికీపేరు వర్తించును. ఇట్టివి కార్బనాకాంపౌండ్సు నందు గాననగుచున్నవి

**ఇసోమార్ఫస్** (Isomorphous) — ఒకేవిధమగు నాకారగుణములతో ననేక Compounds అనఁగా Various Compounds of Various Elements Crystallising పరిస్థితిప్రదర్శనమునకేర్పరచఁబడినది Arsenates and Phosphates of Sodium, Potassium and Ammonium ఒకేమాదిరిగా Crystalline form నందును ఇవి మామూలు పరిస్థితులందు Homogeneous mixed Crystals అగును

**ఇసోప్యాట్** — ఇసోబార్ చూడుఁడు.

**ఇస్థమస్ (భూసంధి)** (Isthmus) — భూసంధి రెండు గొప్ప భూభాగముల నడుమ నుండి వానింగలుపునట్టి వెడలుపు తక్కువగను, పొడవు ఎక్కువగనుండు భూప్రదేశమునకు ఇస్థమస్ అనిపేరు (Land Portions చూడుఁడు)

**ఇస్పాహన్ పురము** (Ispahan) — ఆర్యులగు పారసీకులు ఆదిని దీనికి అస్పాదనమని పేరిడిరని తెలియుచున్నది. ఇటీవలి మహమ్మదీయులు దాని నిట్లు మార్చిరి. ఈ ఇరాన్ (టెహిరన్) నగరమునకు దక్షిణముగా ౨౦౦ మైళ్ల దూరమున ౪,౫౦౦ అడుగుల ఎత్తుగల పీఠభూమిపైనున్న పురము. ఇది షాఅబ్బాస్ ప్రభుని రాజ్యకాలమున (క్రీ. వె ౧౫౮౭-౧౬౨౮) రాజధానివైభవముతో గొప్ప ఉచ్ఛదశననుభవించుచు పదిలక్షల జనులకు నివాసమై యుండెను. సుందరప్రాసాదములు మనిపించుచుండెనట. అందు నలువది స్తంభముల మేడ యనునది నేటికినిగలదు. ౧౭౨౨ లో కొంత పురము భగ్నమైనదందురు

**ఇస్లామాబాదు** — తొల్లింటి అనంతనాగపురము. కాశ్మీరదేశము చూడుఁడు.

**ఇస్త్రినమ్మా వాయన మంచి పుచ్చుకుంటినమ్మా వాయనమన్నట్లు**— ఆంధ్ర లోకోక్తి.

**ఇస్మైలీశాఖ మహమ్మదీయులు—** ఈకాలమున సుప్రసిద్ధుండైన హిస్ హైనెస్ ఆగాఖాన్‌గారి శాఖ ఇస్మైలీశాఖ యనంబడుచున్నది వీరు పారశీకదేశస్థులవలెను ఆంగ్లేయులవలెను గాననగుదురు మహమ్మదు జగద్దేశికుని అల్లుండగు అలీమహాత్ముని సంతతివార మనుచున్నారు వీరికి ఖోజాశాఖవారనియు వాడుకనామము గలదని కొందఱనెదరు ఇక్కాలమున నీశాఖమహమ్మదీయులకు ఆగాఖానుగారే అధిపతులట ఈశాఖవారు భరతదేశమునందు కూడ కలరు. సింధుదేశమునం దున్నారని తెలిసెడిని. ఇప్పటి ఆగాఖానుగారు వారిపూర్వపరంపరయందు నలుబదియెన్మిదవ వారట

ఈసందర్భమున ఆగాఖాన్ బిరుదముంగూర్చి యించుక వివరింతుముగాక. ఇప్పటి ఆగాఖాను గారి పితామహుండు మహమ్మద్ హసన్ అల్హుసేని గారు అప్పటి పారశీకభూపతి యగు ఫతేఆలీషా వలన మామూలు మేరకు శాఖాధిపతిగా నియమింపఁబడిరి వీరి తండ్రిగారగు షాఖలీలుల్లాగా, (శాఖాధిపతిగ) నుండి తరి ఇరాన్ దేశమందలి యెజ్డుపురమున హత్యగావింపంబడిరట దేశప్రభువగు ఫతేఆలీ (షా ఆఫ్ పరిశియా) గారు మహమ్మదు హసన్ అల్ హుసేనీ గారికి తనసుత నిచ్చి పరిణయ మొనర్చిరట వారికి బాల్యమునందు ముద్దుపేరుగ ఆగాఖాన్ అని వాడుకనామ ముండెడివట పిదప నాముద్దుపేరే తర్వాత వారికి బిరుదముగ వాడుకగా నుండెను.

**ఇహాముత్రార్థ ఫలభోగ విరాగ శాస్త్రము** — సాధన చతుష్టయము చూడుడు.

**ఇక్షుగంధ** — నీటి లేక నీరుగొబ్బి గాని గొలిమిడి చెట్టు గాని చూడుడు.

**ఇక్షునది** (Oxus, బక్షు, చక్షు) — దీనినిప్పుడు Oxus అనుచున్నారు. ఇది శాకద్వీపముగూడా ప్రవహించునదిగా విష్ణుపురాణము 2, 4 యందు ప్రశంసింపఁబడినది ఇంకను కూర్మపురాణము 2, 38 యందు ఇక్షునది నర్మదానది కుపనదిగా చెప్పఁబడినది. బహుశః ఇది వేరు నదియై యుండును.

**ఇక్షుమతీనది** — దీనిని కాళిందీనది యనెదరు (తూర్పు) కుమాన్ రోహిల్ఖండ్, కనూజ్‌మండలము వీనిగూడా ప్రవహించునది దీనింగూర్చిన ప్రశంస రామాయణము అయోధ్య కాండమున కలదు

**ఇక్షురస న్యాయము** (చెరుకు) — చెరుకురసము తీయగ మనోహరమైయున్నను దానియందు పిప్పి (అనగా మలినము) కూడ నుండును దానిని తీసివేయుచు సేవలెను ఏ సౌఖ్యమునకైనను కొన్ని బాధకములుండకపోవు. వానిని తప్పించుకొనుచుండవలెనని భావము

**ఇక్ష్వాకుకులగోత్రము** — ఆర్య వైశ్యుల 102 గోత్రములలో నొకటి (వైశ్య గోత్రములు చూడుడు) ఇక్ష్వాకుకులగోత్రము విశ్వాశ్వేయగోత్రము (గీ), సంస్కృత గోత్రము కుత్సస లేక కౌత్సస, కుత్సగణము, మహాతేజస్వర్షి, ఆపస్తంభసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణగ్రంథము ధర్మసింధు నిర్ణయసింధు, సమానగోత్రము మహాతేజస్వసు, భోగీశుండుదేవత, భార్యభోగాంబ, దండకారణ్యము తపస్థానము, భోగసరస్సు తటాకము, జపములక్ష, దీపములు, క్షేత్రసంఖ్య 23, ఏనుగు గుఱ్ఱము దానము, మంకెనపుష్పము, చెరుకు, కామర, వర్జనీయములు.

**ఇక్ష్వాకులు లేక ఇక్ష్వాకువంశ నృపతులు** — వీరు ఆంధ్రదేశభాగముల నేలిన నృపతులు

**ఇక్ష్వాకుశ్యాఖక్షత్రియులు**— క్షత్రియ కులము చూడుడు.

---

**ఈ కంటికీకను రెప్పలుదూరమా?**- ఆంధ్రలోకోక్తి

**ఈక్వినోక్సు** (Equinoxes) —— ఇవి సమకాలస్థానములు రెండు లాటిన్ భాషయందు Equns అనిన సమానమనియు. Nox అనిన రాత్రి యనియు నర్థముగాన పగలు రాత్రియుగూడ సమానముగ పండ్రెండు గంటలు లేక ముప్పది గడియలు కాలము వుండునట్లు సంభవించునో ఆదినములకు ఈక్వినోక్సు (Equinoxes) అని పేరు. (అయనములు చూడుడు)




వేసవికాలమునకు శీతకాలమునకు నడుమను సెప్టెంబరు ౨౨ తేదీ ప్రాంతమునను, శీతకాలమునకు వేసవికాలమునకు నడుమను మార్చి ౨౧ తేదీ ప్రాంతమునను సమకాల దినములు సంభవించును ఇట్టితరి Ecliptic రేఖలు భూమధ్య రేఖను దాటి (సంధించు) తావునకుపైగా సూర్యుడగుపడును మఱియు నట్టితరిసూర్యుని కాంతి ఉత్తర దక్షిణధృవములకు సమముగాగూడ నాకేసాగి గన్పించెడిని. వీనికి వెర్నల్ ఈక్వినోక్సు (Vernal Equinox) అనియు ఆటమ్నల్ ఈక్వినోక్సు (Autumnal Equinox) అనియుం పేర్లు. ఇది భూమధ్య రేఖను సూర్యుడు దాటుటయని చెప్పంబడినది

**ఈక్విటెబుల్ మార్టిగేజి** - వాణిజ్యస బాధ పరిభాషాపదము. Equitable mortgage- ఒకవిధమగు తనఖా (కుదువ) వ్యవహారము సర్వసాధారణముగ కుదువయందు తనఖా ఆస్తి అప్పిచ్చినవానికి పద్ధతులమేరకు హక్కుగ కొంతకాలము వర్తించును. కాని ఇందట్లుకాదు. Deeds, Tittle deedsకుదువ, Depositచేసిన గాని, ఎగ్రిమెంటు వ్రాసిగాని ఋణము తీసికొనిన యీ పేరంబరిగెడిని ఇందు అప్పిచ్చినవానికి Temporary హక్కు కానేరదు.

**ఈక్వేటరు గీత** — భూమధ్య రేఖ చూడుడు.

**ఈక్వెటోరియల్ కర్రెంట్సు** — Equatorial currents- భూమధ్యరేఖ (Equator) కిరుదెసలనుండి బర్వెడు సముద్ర జల ప్రవాహములు దీనిఁగూర్చి సముద్ర ప్రవాహములు చూడుఁడు

**ఈక్వెటోరియల్ కామ్సు**- భూమధ్య రేఖ (ఈక్వేటరు) కుత్తరమున పది లేక పండ్రెండు డిగ్రీల దూరపు పరిసరములు ఉత్తరాయణపు వేసవి కాలమునను, భూమధ్య రేఖకు దక్షిణ పరిసరముల దక్షిణాయనపు వేసవి కాలమునను భూగోళ శాస్త్రమున ఈక్వెటోరియల్ కామ్సు అనుపేరఁ బరగు తావులని చెప్పఁబడి యున్నది ఈ స్థలముల దెసకు ప్రేడ్విండ్సు వీచెడిని అక్కాలములం దిచటి వేడిగాలి ఆకాశమునకు చల్లగాలి వలన నెట్టఁబడుచుండును ఈప్రదేశము అట్లాంటిక్కు మహాసముద్రమున డోల్డ్రిమ్సు అనంబడుచు గొప్ప వర్షములకు తావై యుండును ఇందు ఓడల కవసరమగు నంత గాలి వీవక Depressing effect కల్గి యుండుట, తొల్లింట నావికు లీతావులకుపోవ వెర చుచుండిరట మఱియు నిట సంవత్సరము పొడవునను వేడి యధికమట

ఇట్టి కస్థితి చెల్లుబాగగా పెరుగుట కనుకూలము గాన భూమియం దీప్రదేశము తగులు జాడలందు భూమి జట్టు ఈప్రదేశముల సరణ్యము లుండెడిని

**ఈక్వెడోర ప్రజాప్రభుత్వదేశము** (Equador republic) — ఇది దక్షిణ అమెరికా యందున్న రాష్ట్రము (దక్షిణ అమెరికా చూడుఁడు). ఈక్వేటర్ (భూమధ్యరేఖ) పైనుంట స్వదేశభాషయందు ఆపేరునఁ బరగుచున్నది ఉత్తరకొలంబియా పశ్చిమమున పసిఫిక్కుమహాసముద్రము, దక్షిణమున పెరూరాష్ట్రముచు ఎల్లలు ౧,౨౦,౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యము కలది Galapagos ద్వీపము లీదేశమునకుం జెందినవి పశ్చిమమున ఏండీస్‌పర్వతపఙ్క్తులు రెండు సమసంబుగ నీరాష్ట్రమున గలవు మధ్య గొప్ప లోవలుకలవు తూర్పుమనయందే లోకప్రసిద్ధమైన కోటోపాక్సి అగ్నిశిఖరమున్నది ఇంకను అటనే పిచింఛాశిఖరము, చింబోరాజో శిఖరమును కొంచెము తక్కువగా నట్టివే ఈక్వేటరురేఖపైనున్న క్విటోపురము ప్రభుత్వ కార్యస్థానము, ౯౫౦౦ అ ఎత్తుగల లోవలోనున్నది గువాయాక్విల్పురము రేవుస్థలము. కోకో విస్తారము దొరకు దేశము గువాయాక్విల్ పురము తయు వెనరుబొంగులచే నిర్మింపఁబడినది పలనన భూకంపము లిట మెండుగ సంభవించుచుండుచు లోపల తోలు, కుట్టఁబడుచుండును. రాతి యిండ్లు ఇటుకయిండ్లు నిలువజాలవు

**ఈక్వేషన్ ఆఫ్ టైం** (Equation of time) — కాలవిభజనము చూడుఁడు.

**ఈక్వేషన్ లేక ఈక్వియేషన్ ఆఫ్ పేమెంట్సు** - (వాణిజ్యసంబంధ పరిభాషాపదము) Equation of Payments వేర్వేఱు వాయిదాలలో సొమ్ము చెల్లింపఁబడుచుండుటకు మాఱుగ అంతకు నొకేసారిగ చెల్లించుటకగు మొత్తమును లెక్కించుటకు లెక్కపద్ధతి

**ఈఁగ ఎక్కడ వ్రాలవలెనో అక్కడనే వ్రాలును** — ఆంధ్రలోకోక్తి

**ఈఁగలు** — ఈఁగలు ఇంటింట పగలు వాలుచుండుట నందరెఱిఁగినదే. ఇది బాధకరము గు జంతువులలో నొకటి. ఎన్నిచోట్లనో వ్రాలి యుటకాళ్లకంటుకొనినవానితో మరియొకచోటునకుప్రాకి

వ్రాలిన దోషపదార్థ మంటుచుండుట కలరా, మశూచికము, ఆటలమ్మ, వేపపువ్వు, కొన్ని జాతుల విషపుపుండ్ల దోషము లు మొదలగునవి ఒకతావునుండి వేఱొకతావునకు వ్యాపించెడిని. భరతదేశమున ఆషాఢ, శ్రావణ మాసములందు ఇవి అధికసంఖ్యాకములుగ పెరిగి వృద్ధిబొంది మనుష్యులకు చికాకుం గల్గునటులను, రోగ ములు వ్యాపించునటులను బాధకరములై యుండును ఈఁగలందు అనేక జాతులు కలవు కొన్ని చాల పెద్దవిగ పెరుగునవి వానికి పెద్దయీఁగలని పేరు కొన్ని సర్వసాధారణముగ గన్పడుచుండు మధ్యరకపు ఈఁగలు చాల అధికసంఖ్యాకములుగ నుండును. వానియొక జాతి ఈఁగలు చాలచిన్నవి ఆఫ్రికాఖండమందలి కొన్ని దేశముల సి టిట్సీ అను ఈఁగలు కలవు అవి పశువుల బైంబడి వాని రక్తమును బీల్చి వేయుటవలనను, వీనియందలి విషదోషము పశు వులందు ప్రవేశించుటవలనను అవి చనిపోవును. ఇటుల పశునష్టము వాటిల్లుచుండును పశువులే కాక మనుష్యులు కూడ నిట్టి ఈఁగలు కరచుట వలన మరణింతురట. పెద్దయీఁగల కు తళతళ మెరయు ఊదారంగువంటి రంగులుగల ఈఁగ లుండుట మిరాఖునుకాణములందు గాననగుచుం డును ఇంకను తేనెటీగలు చెట్లయందు తేనెం జేర్చి తేనెపట్టుపెట్టును. కొన్ని ఈఁగలు పుట్టల యందు పట్టుంబెట్టి పుట్టతేనెం గూర్చుచున్నవి ఐరోపా దేశములందు, అమెరికా దేశములందు తేనెకై తేనెటీగలం బెంచుసంస్థలు కలవు.

కందిరీగలు మనుష్యులంగుట్టి బాధ కలుగ జేయునవి ఆోరీగలనంబడునవి పశువులంబట్టుకుని వానిరక్తముంద్రావుచు వదలక వానింబాధించు చుండు దుష్టజాతి యొకటి కలదు గాని, వీనికాటు నందు విషములేదందురు. ఇట్టివనినే చేయుచు పశువులం బాధించు సమ్మెటయీఁగ యనంబడు వేఱొకజాతిఈఁగ పెద్దది కలదు. తూనీగలనునవి వర్షములు గురియుముందు వర్షసూచనం దెల్పు నటుల ఆకాశమున నెగురుచుండునవి ఇవి నిర్బాధకములు

## ఈచేతఁజేసి ఆచేత అనుభవించు నట్లు — ఆంధ్రలోకోక్తి

## ఈజిప్టు దేశపు పది ప్లేగుల

**శాపము** — ఇశ్రాయేలీయులనంబడు ప్రజలు ఈజిప్టుదేశమున ప్రభువగు ఫరో గారిచే నిర్బంధింపఁబడినకతన పరమేశ్వరుఁడగు యహోవ (జెహోవా మోసునకు) దేశమునందు పది ప్లేగు (ఆపద) లు కల్గునటుల శపించెనని బైబిలు నందు కలదు ౧ నైలు నదీజలములు రక్తమగుట, ౨ కప్పలు దేశమునం దధికమగుట, ౩ ఈఁగలు దేశమునం దధికమగుట, ౪ పశువుల రోగములు ప్రబలుట, ౫ గొప్ప కురుపులు ప్రాణుల శరీరములం దగుచుండుట, ౬ ఉరుములు, పిడుగులు అధికముగాపడుట, ౭ మిడతలదండ్లు చేలందినివేయుట, ౮ చీకటి గాఢమగుట, ౯ ప్రథమసంతానములు నశించుట, ౧౦ పశువుల తొలియీఁత పెయ్యలు చనిపోవుట

## ఈజిప్టు దేశపు పిరమిడ్లు —

(Pyramids of Egypt) ఇవి అనేక పరిమాణములుగ పెద్దవి చిన్నవి డెబ్బది కలవు ఈశబ్దమునకు ఉన్నత మని యర్థమట. ఈజిప్టుదేశము ఇప్పటిరాజధానియగు కైరోనగరము నుండి కొంతదూరమున గిజేయను గ్రామపరిసరముల కడుదూరము వ్యాపించియున్నవి. అటకుం బదిమైళ్లదూరమున నున్న కొండలనుండి రాలం ద్రవ్వి తెచ్చి యీ కాలములందు వీని నిర్మించిరి. ఇందు పెద్దదియగుదానిని నిర్మించుట కిరువదియంత వత్సరములు పట్టెనట అది నలువలకల చౌకముగ

ఒక్కొక్కప్రక్క ౯౯౩ అడుగులును, ఎత్తు ౪౮౩ అడుగులును కలిగియున్నది. అనుగుమట్టము కును నొకండుఎకరముల ప్రదేశమునకు. ఇందలిరాళ్లు కొన్ని ౩౦ అడుగుల పొడవు, ౮ అడుగుల వెడలుపు, ౩ అడుగుల దళసరిం గలిగినవి యున్నవి. ఇందులోని మధ్యగదియుంక ఒక ఘనోమృతకళేబరము నుంచుట కీబిరమిడు నిర్మింపఁబడినది. అది ౪౭ అడుగుల పొడవు, ౧౭ అడుగుల వెడలుపు, ౨౩ అడుగుల ఎత్తు ఒకేరాతియంగు తొలువఁబడియుంట యాశ్చర్యమగును. ఇది మనుష్యనిర్మితము కాదనిపించును. వెలుకల ఆదికాలమున నునుపుచేయఁబడిన శిలాఫలకము లమర్పఁబడియుండుటచేతను లచ్చుటచ్చుట యానవాళ్లు కలవు. వీనిపై నెక్కి నక్షత్రముల గమనములను పరిశీలించుచుండిరట. గిజే గ్రామముకడ నారును, అబూశీర్ గ్రామముకడ నైనను, సక్కారాగ్రామముకడ పదునొకండును, దష్షూరుగ్రామముకడ నైదును పిరామిడ్లు లెక్కింపనగును. తక్కినవి చెదరియున్నవి. ప్రపంచములో గొప్ప కట్టడము లని వీనికి ప్రతీతి కలదు.

## ఈజిప్టు (ఐగుప్తు) దేశము —

దీనిని బైబిలునందు గోషనుభూమి (Land of Goshen) అని చెప్పియున్నారు. ఆఫ్రికాఖండము నకు ఈశాన్యదిశనున్న రాష్ట్రము. సహారా ఎడారికి తూర్పుగా నున్నది. వైశాల్యము ౪,౦౦,౦౦౦ చతురపుమైళ్లు. ఈదేశమును శాస్త్రజ్ఞులు Gift of the Nile అని యున్నారు. ఆదికాలమున సముద్రము దేశమంతటను ఇంచుమించుగా నుండెనట. ఏలనన, ఇప్పటికొండలపై దొరకు సముద్రపుగుల్లలు దీనికి నిదర్శనము. రానురాను సముద్రము వెనుకకు పోవుచుంటయు, ఏటేట నదీప్రవాహమున కొట్టికొనివచ్చిన బురద నది కిరుదెసలను చేరుచుంటయు జరుగుచుండెను.

ఇట్లు జరగిజరగి ఈదేశ మేర్పడుచు కడకు విసనకఱ్ఱవలె మధ్యధరాసముద్రములోనికి లంకపెరుగ, పిదప నైలునది, రోసెట్టా, డామియెట్టా అను పేర్లుగల రెండుశాఖలుగ చీలి, ఇరుప్రక్కలకు లంకం బెంచుచు ముందుకు నడచి ఆపేర్లనే వహించుచున్న పురములకడ మధ్యధరాసముద్రమునం జేరుచున్నది. ఇంక నేకారణముననో ముందునకు లంకను బెంచుటకు నైలునదికి నుస్తరమై యాగిపోయెను. ఇది ఈజిప్టు ఏర్పడిన వృత్తాంతము. నైలునదిచేసిన కార్యము ఆదేశభూమి యంతయు వర్షములులేని ప్రదేశమగుట, నదీజలములచే భూమిని దడిపి సారవంతముగం జేయుటకు ఆనకట్టలను, డాములను, బారేజిపనులను నదియందు కట్టి నిర్బంధించి నీటిని నిలపియు, కాల్వలు త్రవ్వియు, జలనిలయములు (రిజర్వాయర్) నేర్పరిచి త్రవ్వించియు, కట్టించియు, పొలములను దడిపి పైరులం బెంచుచున్నారు. ఈ జలాశయము లందు క్రీ. పూ. ౪౪౦౦ ప్రాంతములందు త్రవ్వఁబడినట్లు తెలంపఁబడుచున్న యూసూఫ్‌బహారనుకాలువ ప్రాచీనమైనది. అది అప్పటి ఫరోవద్ద మంత్రిగనుండిన జోసెఫ్‌వల్ల త్రవ్వింపఁబడి ఫయ్యూం పురమునకు నీటివసతిం గల్గించునది. ఈమహానుభావుడే స్వప్నఫలములందెల్పు జోసెపు ఇశ్రాయేలు కుమారుడు.

ఈజిప్టుదేశము నైలునది కిరుదెసల నుండు ఫలవంతమగు భూములును, ఆప్రాంతపుభూములనం దగును. నైలునదికి కొల్లి టాపీసు నీలానది ఇప్పటిభాషలందు నైలుగ మారినది. ఈ నది యొక్క క్రిందిభాగమును సముద్రముకడ విసనకఱ్ఱరూపమున నేర్పడిన డెల్టాప్రదేశము నని చెప్పఁబడినది. ఇది నీలానది యొక్క రెండుశాఖలగు రోసెట్టా, డామియెట్టానదుల నడుమ నున్న లంక. నైలునదిలోయ ఉత్తరదక్షిణములకు వ్యాపించియున్నదాని కిరుదెసలందు తూర్పుపడమర

లందు పొడవునను రెండుపర్వతముల వరుసలు వ్యాపించియున్నవి. అవి కొన్నిచోట్ల దట్టమైన పర్వతాకారములుగను, కొన్నిచోట్లను కేవలము పొట్టివియై ఉన్నతప్రదేశములవలెను గాన నగుచుండును ఎత్తైన చోట్లందు ౨,౦౦౦ అడుగుల ఎత్తుకొండలుగ నున్నవి. దిగువభాగమున నీలానదియొక్క యుపనదియైనను లేకుండుటలేదు. వ్యవసాయములకుగాను ఇరుదెసలనుండి నదీప్రవాహమునుండి తీసివేయుజలము రానురాను తరగిపోవుచు, సముద్రము చేరుచోట నీరు కేవలము తగ్గిపోవుట గానగును. నది ఏటేట వరదలు వచ్చినతరి, ఇరుదెసలను పెద్దపెద్ద కాలువలు, జలనిలయములు నింపబడి సంవత్సరము పొడవున నుపయోగమునకు నిల్వ చేసికొనబడుచుండును. తక్కిన కాలములందు షాడూఫ్ అనబడు చక్రములు, నీటిపంపులు, ఏతాములు లెక్కకు మిక్కిలి మీరి నీటిని పై వ్యవసాయపు పొలములకు తోడుచుండుట ఈదేశమున నిత్యదృశ్యమే.

ఈదేశమున వర్షములు కురియవు. భూమి సారవంతమై నీరందినచోట మిగుల ఫలవంతముగ నున్నది. వేసవియందు వేడి యధికము గాని తక్కిన కాలముల మనోహరమై యుండును. రాత్రులందు దట్టమైన మంచు విస్తారముగ కురియుచుండును. ఇది పంటలకు చాల నుపయోగించుచున్నది. జొన్నలు, మొక్కజొన్నలు, గోధుమలు, చెరకు, ప్రత్తి, నీలిమందు, పొగాకు, ఉల్లిపాయలు, గుమ్మడికాయలు విస్తారము పైరు చేయబడుచున్నవి. నారింజతోటలు, ఖర్జూరపు తోటలు విస్తారము కలవు. అరటితోటలును అచ్చటచ్చట వేయబడుచున్నవి.

ప్రజలు ఆదిమనివాసులగు కోప్టుజాతివారు, ఇతను అరబ్బుసంతతివారు, తురుష్కులు, ఐరోపాదేశస్థులు, దక్షిణసీమలవారగు నీగ్రోలునై యున్నారు. అరబ్బీభాష వాడబడుచున్న భాష. వ్యవసాయముచేయుచుండు రైతులకు ఫెల్లా (బహువచనము ఫెల్లాహిన్) అనుచుందురు. బటానీపంట కొన్నిప్రదేశముల నపరిమితముగ పైరుచేయుచున్నారు. ప్రత్తి, బటానీలు, గోధుమలు, పంచదార, విదేశములకు ఎగుమతిచేయబడుచున్నవి. ఉల్లియుంగొంచెముగ నెగుమతి చేయుటకలదు. ప్రభుత్వము కాన్‌స్టిట్యూషనల్ మోనార్కీ (Constitutional Monarchy) పద్ధతి. భూపతికి ఖడీవని బిరుదనామము. పార్లమెంటు కలదు.

ఈజిప్టు పూర్వచరిత్రము వింతగొల్పును. ఫరోల కాలమున నిది చాల బలవంతమగు ప్రభుత్వమైయుండెను. పిరమిడులు, స్ఫింక్సు కొన్ని ప్రాంతదేవాలయములు వారినాటివేయై యున్నవి. ఆ కాలమునకే ఈజిప్టు నాగరికత నందినదేశమై విద్యావంతమైయుండెను. కడపటి ఫరో క్రీ పూ ౩౦ సంవత్సరమువరకుండెనని చెప్పబడినది. క్రీ పూ ఐదువేల సంవత్సరములకు పైగా ఫరోభూపతుల పాలన ప్రారంభమని చెప్పవచ్చును. క్రీ పూ ౫౨౫ లో పారశీకచక్రవర్తిగనుండిన కాంబైసేను ఫరోలను జయించి రాజ్యమాక్రమించెను. క్రీ పూ ౩౩౨ లో అలగ్జాండరు దిగ్రేటున కీరాజ్యము వశమయ్యెను. ఆయన మరణానంతరము ఆయన సేనానియగు టోలెమీ (Ptolemy) వశమై చిన్నరాజ్యములుగ పిదప విభాగమయ్యెను. క్లియోపాత్రారాణి ఆయన సంతతియందు కడపటిది. ఆమె క్రీ పూ ౩౦ లో చనిపోయెను. పిదప ఈజిప్టుదేశము రోమనుచక్రవర్తుల వశమాయెను. వారినుండి సరాసినుజాతి మహమ్మదీయుడగు కేలిఫు ఓమారు వశమై క్రీ శ. ౬౪౦ మొదలు ౧౫౧౭ వరకు కొంచెమెచ్చుతక్కువగ నుండెను. పిదప తురుష్కసుల్తానుల వశమై

వారినుండి విముక్తి నిటీవలఁబడసి, కొంతకాలము బ్రిటిషువారి రక్షణకు లోఁబడి, ఇప్పుడొకఖడీవు పాలనమున స్వతంత్రరాజ్యమై యున్నది ప్రభువు మహమ్మదాలీ సంతతివాఁడు ప్రజలంగు సర్వ సాధారణముగ మహమ్మదీయమతమును ఆదిమ నివాసులగు కోప్టునందొక విధమగు క్రైస్తవ మతమును వ్యాపించియున్న ది

తొల్లింటి ఫరోలకాలపుఁబనులలో పిరమి డు గొప్పవి (ప్రపంచమందలి యాదికాలపు వింతలు, మధ్యకాలపువి తము ూ నుఁ ం) ఆ కాలపు తీబీసునగరము (అప్పరు ఈజిప్టు) శతద్వారనగరమై యు డెను స్ఫినిక్సు నుచుమ్య స్త్రీ ముఖముతో సింహశరీరము గలదియై యున్న ది చనిపోయినవారి దేహముఁ కేదియో పూసి, కుళ్లకు డఁ సి మమ్మీలం జేయుచు డెడి వారు ఆకాలపు పీనుగుమమ్మీ లెన్నియో పిదప బయలుపడినవి అరబ్బులు వీనిఁదీసికొని పోయి పొలముల కెరువుగఁ జేసికొనినను ఇ కను కలవు

కైరోనగరమీదేశముఁకు రాజధాని దీనికి తొల్లింట ఫేసాయనియు, అల్కాహారా (జయ స్థలము), ఉముద్దున్యా(భూమాత) యనియెన్నియో పేర్లు వాడుకనుండినవి కలవు ఇది క్రీ వె ౯౭౦ లో నిర్మింపఁబడినది రాజనగరు సల్లాదీన్ భూపతి నిర్మించినది ఉన్నతస్థానమునగలను అది క్రీ వె ౧౧౭౦ లో నిర్మింపఁబడినది క్రీ వె ౧౨౫౦ మొదలు ౧౫౧౭ వఱకు ఈరాజ్య మును మహమ్మదీయులలో మేమ్లూక్ తెగ మహ మ్మదీయులగు సుల్తానులు పాలించిరి ఇందారు లక్షల జనులు వసించుచున్నారు

మధ్యధరాసముద్రముపైనున్న అలెగ్జాండ్రియా పురము రేవుపట్టణము ఇది గొప్ప వర్తక స్థలము. అలెగ్జాండరు దిగ్రేటుచే నిర్మింపఁబడి నది సూయజ్ పట్టణము సూయజుకాలువకు తనపేరిచ్చిన రేవుపట్టణము ఇది ఎఱ్ఱసముద్రముకడ నున్నది సూయజుకాలువ పోర్టుసయ్యదు నుండి ఇటకు ౮౭ మైళ్లపొడవున త్రవ్వఁబడినది అదిమధ్య ధరా సముద్రమును, ఎఱ్ఱ సముద్రమును కలుపు చున్నది ఈలువ పెద్దబట్టరులేకు, చిన్నబట్టరు లేకు మంజెల్లాసరస్సులగుండా నడచును కాల్వ తీరముగ మధ్యగా ఇస్మేలియా యను రేవుపట్ట ణము కలదు రోసెట్టా, డామియెట్టా అను పేరుగ రేవుకట్టణము ఁ ఆపేర్లుగల నీలనదీ శాఖలు సముద్రగామియగు తావులందు గం చి న రేవు ఁ

అస్పరీ ప్టునను సియూ ఁ ప్రధానపురము మొదటి కేటరాక్టుకడనున్న అసాఅన్పురము కడ గొప్ప ల్లకానమురాతి గనులున్నఁ కైరోను డి ౮౦౦ మైళ్లు దూరము రెండవ కేటరాక్టుకడనున్న వాఁఆఫాపురము ఈజిప్టు దేశపు దక్షిణముకడనున్న పట్టణము రెడ్డ తరము కొస్సేర్పురమును, సుఆకిన్పురము ను ఒకపాటి రేవుపట్టణములుగ నున్నవి

## ఈజిప్టు ప్రత్తి వ్యవసాయము —

ఈజిప్టుదేశమునుండి తేబడి భరతదేశమునందు కొద్దిగనో గొప్పగనో నిలచియున్న ప్రత్తిజాతులు అబ్బాసి, అష్మోని, అఫీపె, సుల్తానీ, యన్నొడీవ్ అనునవియై యున్నవి ఇందు కొంతగా నిలచి సరిగా ఫలించున్న జాతి అబ్బాసి యొకటియె యని చెప్పవగును వీనిని నాటుటకి వనునించుక యధికమైనచో వేళ్లు కుళ్లి చచ్చిపోవును. చెమ్మ తప్ప యెక్కువ తడియె పనికిరాదు విత్తనమేపాటి పాతగిలినను మొలవనే మొలవదు అట్టి గింజ లం బగులఁ గొట్టి నాఁచిన లోన పుచ్చిపోయి యుండును కృష్ణాజిల్లా వ్యవసాయసంఘపు కార్య దర్శిగ నుండిన వీరరాఘవాచార్యులుగారొకతరి,

ఈజిప్టువిత్తనములు, అతిల్లాభాములకు సరిపోవని నుడివియుండిరి కాని చెట్లు ఎదిగినపైని వారమున కొకసారి నీరు కట్టుచుండవలయును ఇంకను దీనిని చూడవలసియే యున్నది

**ఈజ్ మెంటు హక్కు** — (వాణిజ్య సంబంధపరిభాషాపదము) Easement right ఒకరి ఆస్తిపై నింకొకరికిగల హక్కు నకు ఈజ్ మెంటు హక్కు అనియెదరు ఇది సర్వసాధారణముగ కొకరి స్థలములోనుండి ఇంకొకరు నడచు మార్గము హక్కుగా నుండెడిని, దీనికి సనాతనముగ ఆచరింపబడుచుండుట మూలకారణముగ నుండెడిని

**ఈకెలు, బల్లెములు**— బల్లెములు చూడుము

**ఈదరుడాన్** (హాసకూలికి)—ఫారోయీ ద్వీపములు చూడుము

**ఈదువుకాళ్లూ, ఏదుపు మొగము** దరిద్రపులక్షణములంచెల్పు సామెత (అ ధలోకోక్తి)

**ఈతకల్లు ముందర యిల్లాలైనా పనికిరాదు** — తాగుబోతుకు భార్యయందు కూడ సక్కరయుండదని భావము (ఆంధ్ర లోకోక్తి)

**ఈతకుమించిన లోతు, గోచికి మించిన లాతియుండదు**— (లాతి తక్కువ) ఆంధ్రలోకోక్తి

**ఈతకొట్టు నేర్పు** — సాధారణముగ మనుష్యుని ఊపిరితిత్తులు (Lungs) నిండి గాలియుండిన నీటంబడుచో తేలగలడు. కాని శరీరపు బరువు నిరుపాంగను సమముగ నుంచుకొనునేర్పు కల్గియుండనిచో (ఈతరానిచో) నెచ్చుతక్కువలై జాగ్రతదప్పి నీటనొకతరి మున్గును ఇత్తరి గొంతునీరు బలాత్కారముగ విధిలేక త్రాగిన నీరూపిరితిత్తులలోనికిం జేరి నీటం దేలతగిన పరిస్థితిని కొంతతగ్గించును కొట్టుకొనుచు, మరియొకతరియు, ఇంకొకతరియు, బహుశః నాల్గవతరియుంగూడ పైకితేలియు జాగ్రతం దప్పుచు నిస్సహాయత చేదోడువాదోడుగనుంట తిరుగమున్గుచు, నీరుద్రావుచు, ఊపిరితిత్తులను నీటితోని పుకొనుచు ఎట్టకేలకు పైకితేలలేక నీటనాశరీరముండిపోవుచు నీటనాని రెండుమూడు రోజులలో శరీరమంతయుచుబ్బి నీటికన్న జాలకనయై పైకిందేలును ఈయుపాయపరిస్థితులనుండి తప్పించుకొనుటయే ఈతనేర్పు పశువులలో పెక్కుజంతువులకు ఈతకొట్టనేర్పునైసర్గికముగ శరీరతః కల్గియుండు. గాన నవి విపరీతపరిస్థితులలోగాని నీటంబడి ఈదనేరక చనిపోవుట సంభవింపదు (ఈతకొట్టువిద్య చూడుము)

**ఈతకొట్టు విద్య** (ఈదుట) — నీటియందుగాని, నీటిపైగాని తేలుచుకదలుట ఈతకొట్టటయని పేరు ఈదుటయందు గాలితిత్తులు మొదలగు కృత్రిమసాహాయ్యములుండుట కాదని చెప్పబడినది ఈదుట పాకుటంబోలిన క్రియయని తెలుపుచుండిరి పాశ్చాత్యులు Heart Stroke అనియు నొకవిధానముం జెప్పిరి ఈదుట భరతదేశ విధానమున నిలువుటీత (నిలచుండి ఈదుట), పడకటీత (పరుండి ఈదుట) యని ద్వివిధములు ఈపడకటీత బోర్లపరుండియు, వెల్లకలపరుండియుం గూడ నీదుదురు ఊపిరి బిగియబట్టుటయో లేక కొంతవరకైనను గాలిని లోన నిర్బంధించుచుండుటతో నూపిరి మెల్లగ విడచుచుండుటయో ఈతయందు శరీరముం దేలగొట్టుచుండుటకు సాహాయ్యపడును పాశ్చాత్య విధానమున Breast Stroke అనుదానియందు కాలుచేతుల కదలిక ముఖ్యము ఒకతరి కదలికరుగ నారంభించుట మధ్యకాలమున ఊపిరి

దీనికొనుచుండవలెనని చెప్పఁబడినది. చేతులతో కాళ్లను సమకాలముననే కదలవలయునని చెప్పఁబడినది. చేతుల నిరుపార్శ్వములకుఁ జాచునపుడు కాళ్లను చాచవలయును. నీటియందు మున్గియుండుతరితప్ప, తలి ముంచనకుఁజనుతఁ తలయెత్తియే యుంచవలసియుండును. ఇ కను పాశ్చాత్యవిధానమున Back Stroke అనియు, Overturn Stroke అనియుఁ గూడ చెప్పఁబడినవి కలవట (ఈతకొట్టి నేర్పు చూడుఁడు)

**ఈతగింజ నిచ్చి తాటిగింజ లాగే వాడు** — ఇచట రెండును నిరర్థకములే యైనను ఈతగింజ చిన్నది యనియు, తాటిటెంక పెద్దది యనియు భావము. ఆంధ్రలోకోక్తి

**ఈతచెట్టు** — గా Phoenix sylvestris Eng Wild Date పుల్లవగరు, తీపి గల్గి యుండును. చలువ, ధాతుపుష్టి, కొద్దిగ మేహశాంతి చేయును, మదము బుట్టించును. వాతము, పైత్యము, రక్తపైత్యము, తాపము దాహము, క్షయలను హరించి గురుత్వముగనుండును. కడుపులో ఉబ్బరము గల్గించును. పువ్వులరసము లోపలికిచ్చిన, మేహపైత్యము, రక్తపైత్యము, రక్తాతిసారము హరించునని చెప్పఁబడినది. మఱియు ఋతురక్తస్రావము తగ్గుననియు, నీళ్లవిరేచనములు, రక్తవిరేచనములు శమించుననియు చెప్పఁబడినది. ఇంకను నోటిపూత శమించుననియుఁ గూడ చెప్పఁబడినది. ఈతకల్లు కాకదగ్గు, పైత్యము, మేహవాతపు నొప్పులు శమించునంతటి చలువజేయును. ఈతసారాయము తీవ్రమైన కఫరోగమునందుఁ జ్వరము మూలవ్యాధుల నడంచును. నీళ్లుకల్పిన తేనెయు, వసకషాయమును, విరుగుడు లని చెప్పబడినది. ఈతచెట్ల జాతి యందధమజాతియగు చిట్టీతచెట్టు జాతి కలదు. దీనికి సంస్కృతపు పేరు ప్రత్యేకముగ గానరాదు. కొందఱు పరూషక, పరాపరయని తెల్పిరిగాని, ఇవి పాలాస్త్రీచెట్టు పేర్లు. దీనిపండ్లు వాతపైత్యముల నివారించుననియు, లేత కాయలు వాతమును హరించి యించుక పైత్యము గల్గించు ననియుఁ జెప్పుదురు.

**ఈతచెట్టుక్రింద పాలు త్రావినా కల్లుత్రాగెనని యందురు** — ఆంధ్రలోకోక్తి

**ఈత చేతనైతే ఎంతలోతైనా ఒకటే** — ఆంధ్రలోకోక్తి

**ఈతముల్లు విరగద్రొక్కే కాలము** (గ్రీష్మమని భావము) ఆంధ్రలోకోక్తి

**ఈతిబాధలు ౬** — ౧ అతివృష్టి వర్షాధిక్యమువలన కల్గుబాధ ౨ అనావృష్టి వర్షములు లేకుండుటచేఁ గల్గుబాధ ౩ ఎలుకలవలన గల్గుబాధ ౪ మిడతలు వరిచేలను కొరికివేసి నాశనమొనర్చునవి ౫ చిలుకలు తోటలలోని ఫలములను కొరికి పాడుచేయును ౬ సన్నిహితరాజులు ప్రభువులకు సమీపమున నుండుట బాధకరముగ నుండెడిది

**ఈథరు** (Ether) — హైడ్రోజనుగాలియు హీలియము (Hydrogen and Helium) కలిసి ముఖ్యముగ నీథరగునని పరిశీలకు లనెదరు. ఇది ఆకాశమునుండి భూమివరకుఁగల మధ్య ప్రదేశమున (సావకాశమున) వ్యాపించియుండునని చెప్పఁబడినది. ఇదియె సూర్యుని కాంతిని మన కడకు నడిపించునది. ఇది యదృశ్యమగు పరమాణుసముదాయమనియు, సూర్యచంద్ర నక్షత్రాది సమస్తమును కన్పింపఁజేయునది యని చెప్పఁబడినది. ఈథరు ఘనీభవించిన గాలికన్న సన్నని వగు మేఘము లగుననియు, వానినుండియె భూమివంటి గోళములు జనించుననియు,

తొల్లి భూమ్యాను లిట్లే యేర్పడి పెరిగినవనియు పాశ్చాత్య పండితులు నుడువుచున్నారు.

**ఈదబోతే (తాగనీరు దొరకనట్లు**- (ఈదబోతే = ఈదుట కేగితే) ఆంధ్రలోకోక్తి

**ఈదురుపల్లి భవానీశంకర కవి**— ఆంధ్రకవులలో నాథునికుడుగ పరిగణింపబడిన వాడు ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు. భారద్వాజసగోత్రము, తండ్రి శంకరయ్య దిట్టకవి వేంకటరాయకవి కడ జనువుకొనినవాడు ఈకవి శృంగారమంజరి యను ప్రబంధమును, ధర్మఖండము నాంధ్రపద్యరూపమునను రచించెను కూచిమంచి తిమ్మనకవి సార్వభౌముని కాలమువాడందురు

**ఈనగాచినక్కలపాలొనర్చినట్లు**– (ఈనుట = ప్రసవించుట) ఆంధ్రలోకోక్తి

**ఈయని మొండికి విడువనిచండి** ఆంధ్రలోకోక్తి

**ఈయూరి కాయూరెంతో ఆ యూరికి నీయూరంతే** — ఎంతో=ఎంత దూరమో, అంతే=అంతదూరమే ఒకరిమనస్సు తనపై నెట్లుండునో తన మనస్సును వారిపై నట్లేయుండునని భావము ఆంధ్రలోకోక్తి

**ఈర్ఘటి గోత్రము** — కుశికగణము చూడుడు

**ఈర్ష్యాహి వివేకపరిపంథినీ** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి ఈర్ష్య వివేకమునకు శత్రువని భావము

**ఈలకూర చెట్టు** — ఉప్పునదిగల్గి యుండు కూర అపథ్యకరమైనది విదాహమును గల్గించును.

**ఈవినింగ్ స్టార్** (Evening Star)- శుక్రుడు. వీనస్‌గోళము చూడుడు.

**ఈవు జగన్మాత సమాధి (జిడ్డా)** (Eve's grave, Jidda) — ఆదమ్ ఈవులు యూద, క్రైస్తవ, మహమ్మదీయ మతములందాదిమ దంపతులుగ జెప్పబడినవారు అందు ఈవు (స్త్రీ) సమాధి అరేబియా దేశమునందలి జిడ్డాపురమున కుత్తరముగ రొక మైలుదూరమునందు కలదు. జిడ్డా మక్కా నగరమునకు ౩౮ మైళ్ల దూరమునందున్న రేవుపట్టణము. ఈవు జనని ౧౧౮ అంగుగులపొడవని చెప్పబడినది ఈమె సమాధి ౪౦౦ అంగుల పొడవుగను, ౧౧ అడుగుల వెడలుపునను ఉన్నది తలకడను, పాదములకడను చిన్న దేవతాస్థానములు నిర్మింపబడినవి

**ఈశత్వసిద్ధి** – సిద్ధి స్థలు చూడుడు.

**ఈశానుడు** — పరమేశ్వరుడగు రుద్రుని ఎనిమిది యాకారములలో నొకటి అష్టమూర్తులు చూడుడు

**ఈశావాస్యకర్పూరము**– ఇది కర్పూరములలో నొకదినుసు కర్పూరము కొంచెము పసుపురంగు కల్గి యిసుకంటోలి యుండును ఇది శైత్యోపచార పదార్థము తాపము నడంచి, ఇంచుక ధాతుపుష్టిం గల్గించునది అతిసారము, క్రిమి, చెమట, దగ్గు, భ్రమ, మత్తత, శోషల నడంచును

**ఈశ్వరకళలు** – కళలు చూడుడు

**ఈశ్వరచంద్రవిద్యాసాగరుడు** – ఈయన గొప్ప విద్వాంసుడు వంగదేశీయుడు. ఉత్తమకులీన బ్రాహ్మణుడు తల్లి భగవతీదేవి. ఆమె స్త్రోత్సాహమున స్త్రీ పునర్వివాహములు శాస్త్రసమ్మతమని వాదించుచు తాను చేయుచుండినవాడు.

పెక్కు గ్రంథముల నీయన రచించెను. గొప్ప స్వార్థత్యాగి, సత్యవంతుడు ననిపేరందిన

వాఁడు. క్రీ. శ. ౧౬౫౧ లో మృతినందెను.

**ఈశ్వరిచెట్టు** – లా **Aristolochia indica**- ఆంగ్ల **Indian Birthwort.** సం విషఘ్నిణి, మహాయోగేశ్వరి, నాగదమని, నాగదలం, నాగద గ్రామ్యపదముగ ఈశరచెట్టని వాడుదురు ఇది తెల్లయీశ్వరి, నల్లయీశ్వరి యని ద్వివిధముగ నుండును ఇందు తెల్లయీశ్వరి శ్రేష్ఠమని వైద్యు లందురు. వెగటు చేదు రుచులం గల్గి కాకఁజేయును. సర్వవిషములను ముఖ్యముగ సర్పవృశ్చికవిషములను హరించును పాములు తెల్లయీశ్వరివేరనిన సహింపక వెనుక మొగం బిడును

మఱియు, శ్వేతకుష్ఠు (బొల్లి), సర్పి, దద్రు, (వల్లికలు మొదలగు దద్దురులు) వ్రణములు హరించుననియు, విరేచనము జేయుననియు, శరీరమునందు గట్టిపడిన దోషపదార్థములను విడగొట్టి వెడలజేయుననియు, అజీర్తివిరోచనముల నాపుననియు, జ్వగములు, నొప్పులు, కంటికురుపులు శమింపఁజేయుననియు, గర్భస్రావము గల్గించుననియు, ఆకులు జ్వరములు హరించుననియుఁ జెప్పఁబడినది

**ఈషణత్రయము** — ఈషణ మన ఇచ్ఛ, లేక కోర్కెయని యర్థము. ఏడకుండు వాంఛయని భావము. ౧ ధనేషణ ధనముందలియాశ, ౨ దారేషణ- స్త్రీలయందలి వాంఛ, 3 పుత్రేషణ- సంతానము, కుటుంబవృద్ధి మొదలగు వాంఛ

**ఈస్ట్రన్ తురుష్కస్థానము** — చీనాతురుష్కస్థానము చూడుఁడు. (తురుష్కస్థానము చూడుఁడు).

**ఈనఫ్‌కథకుడు, ఈనఫ్‌కథలు** — **Easop's fables** అను గ్రంథమువకు కర్త తొలుత బానిసగనుండి విడుదలయై (సామోసు నందు) తనజన్మస్థానమగు ఫ్రిజియాయందు తిరుగ గొంతకాలముండి, లైడియాప్రభువగు క్రోయెసస్ భూపాలుని కొలువుం జేరి, ఆయన సన్మానము వడసినవాఁడు మహమ్మదీయమతస్థుఁడు. అరబ్బని కొందఱనెదరు. బహుబుద్ధిశాలియు దూరాలోచనపరుఁడని పేరొందినవాఁడు తండ్రిపేరు బారా. సుప్రసిద్ధుఁడగు జాబ్ అనువానికి బంధువు. దావీదు నెఱింగినవాఁడు చిరకాలము జీవించెను. అంగవికలుఁడనియు, బానిసగ నుండినతరి ఎథియోఫ్ అను నామమున బరగుచుండెననియు, అసలుపేరు లోక్మాన్‌యీసూఫనియు, ఖురాను నుండి కథలయీహల నందెననియు, అరబ్బులను చున్నారు ఈతని కథల నన్నిదేశములవారును గౌరవించుచుందురు

**ఈస్టు ఇండియా కంపెనీ** (**East India Company**) ఈపేరుగల సంఘములు బ్రిటన్ దేశమునను, హాలండుదేశమునను ఇంక కొన్ని ఇతరదేశములయందును కూడ స్థాపింపడినటుల తెలియుచున్నది బ్రిటిషు ఈస్టు ఇండియాకంపెనీ, ఈస్టు ఇండీసుతో వర్తకవ్యాపారము నలుపుటకు క్రీ.శ. ౧౬౦౦ డిసెంబరు కడను పట్టా(**Charter**) ను ఎలిజబెత్‌రాణి (**Queen Elizabeth**) వారివలన పొందెను వర్తకస్థలములు తొలుత సూరతుపట్టణమును, పిదప బొంబై, ఫోర్టుసెంటు జార్జి (చెన్నపట్టణము), గంగాతీరమున హుగ్లీ పట్టణమున శాంతను చేయఁబడియెను ఏబదిసంవత్సరములకుఁ బిదప హుగ్లీవర్తకస్థానము కలకత్తాకు మార్చబడియెను.

క్రీ. శ. ౧౭౬౫ లో ఈస్టుఇండియాకంపెనీ బంగాళాదేశమున పరిపాలన మొనర్పువారైరి బ్రిటీషుపార్లమెంటునందు ౧౭౮౪ వ సంవత్సరమున (**Pitt's India Act**) పిట్సు ఇండియా

చట్టము ఇంకుకొఱకై శాసింపఁబడి, అందు తమ కుత్తరవాదిగ పార్లమెంటువా రేర్పరిచిన రొుక బోర్డువారును, ఈస్టుఇండియాకంపెనీకిని జాయం టుగా పరిపాలనపరిశీలనాధికారము లీయఁబడెను కాని ౧౮౫౭ సిపాయిల తిరుగుబాటు (Mutiny) తో పరిపాలనాధికారము బ్రిటీషుప్రభుత్వము వారివశము చేసికొనఁబడి క్రౌన్‌పరిపాలనమై ౧౮౫౮ లో కంపెనీ రద్దుపర్చఁబడి, అంత మయ్యెను

**ఈస్టు ఇండీసు** (East Indies) — దీనికి సరియైనయర్థము పాటింపఁబడుటలేదు ఈస్టు ఇండియాకంపెనీవారి కిచ్చిన ఛార్టరులో ఇండియా దేశముమాత్రము ఇండీసుగా వివరింపఁబడినది కాని వాడుకయందు, ఇతరకాగితములందు ఇండూ చైనా, మలేపెనిన్సులా, మలే ఆర్చిపిలెగో ద్వీపము లన్నియును, సుమత్రా, జావా, బోర్ని యో, న్యూగినియా, ఫిలిప్పైన్సుద్వీపములపేర్లును ఇందే గానవచ్చెడివి.

ఇక్కాలమున డచ్చి ఈస్టుఇండీసు (హాలండు ప్రభుత్వమువారివి) నందు సుమత్రా ద్వీపము, జావాద్వీపము, బలిద్వీపము, మధురాద్వీపము, సెలిబీస్, బిల్లిటన్ ద్వీపములు, బాస్కాద్వీపము, లోంబాకుద్వీపము, సుండాద్వీపములు, మొలక్కా ద్వీపములు, టిమోరుద్వీపములను కొన్నియు, బోర్నియో ద్వీపభాగము న్యూగినియా చేరి ౭,౩౩,౦౦౦ చతురపుమైళ్లుగా నున్నవి

**ఈళినుఁడు** — ఈతనికి రైభ్యుఁడనియు పేరుకలదు పూరువంశపు క్షత్రియుఁడు తండ్రి పేరు సుమతి మఱియు రైభ్యుఁడను ఋషి యొకఁడు కలఁడు. అతనికి అర్థావసు, పరావసువు లను వారిద్దరు పుత్రులు

---

**ఉంగరములచేతితో మొట్టికే నెప్పదందురు**— ఉంగరములు గల చేయి యన భాగ్యవంతులచేయి యని భావము (ఆంధ్రలోకోక్తి)

**ఉంగరముల (లెక్క) పద్యము** — దీనిఁగూర్చి యిటులఁ జెప్పఁబడినది. ఈపద్యము లెవ్వరు రచించిరో తెలియదుకాని యీలెక్క యనాదిగ గలదు.

క మున్నూటరువదిమాడలు
ఎన్నఁగఁ బదియుంగరంబు లెంతెంతో భటుం
డెన్నాళ్లు జీతమడిగిన
నన్నాళ్లకు యుంగరంబు లొతండిచ్చున్‌॥

ఇంకను దీనిందెలియుట కీపద్యము చెప్పఁ బడినది

ఆ ఒకటి రెండు మూఁడు నొనరంగనాల్గిడి
యవియుఁబెట్టి సున్నలమరఁబెట్టి
నూరుబెట్టి పిదప నూటయేఁబదిబెట్టి
ఉంగరంబులెత్తు లెఱుగవచ్చు ॥

అనగా ఒక మాడ ఎత్తు ఉంగరము ఒకటి,
రెండుమాడల ఎత్తు ఉంగరము ఒకటి,
మూఁడు ,, ,, ,, ,,
నాల్గు ,, ,, ,, ,,
పది ,, ,, ,, ,,
ఇరువది ,, ,, ,, ,,
ముప్పది ,, ,, ,, ,,

నలువదిమూడల ఎత్తు ఉంగరము ఒకటి
నూరు ,, ,, ,, ,,
నూటఏబది ,, ,, ,, ,,

ఇటులే బిరియుంగరములు కల్పి మొత్తము మున్నూటరువది మూడలగును. మూడయినన ఇంచుమించు రెండుహస్తములు విలువగల్గిన ఎత్తుగలది

**ఉంటేఊరు లేచిపోతే పాడు** — ఆంధ్రలోకోక్తి

**ఉండవల్లి గుహలు** — ఆంధ్రదేశమున బెజవాడకు సమీపమున, ఇప్పటి గుంటూరు మండలమునకుం జెరి కృష్ణానదికవ్వల (దక్షిణ తీరమున) ఉండవల్లి యనఁబడు గ్రామ మునకడ గల గుహలు ఇందు ముఖ్యమగు పెద్దగుహ హిందువుల విష్ణుదేవాలయమై యుండెను ఇది నాల్గంతస్తులుగ తొలువఁబడినది దీనియందు గాలరీలు కలవు. మూడవ యంతస్తునందు శయనించియున్న విష్ణుదేవుని విగ్రహమున్నది రాబర్టుసెవెల్ పరిశోధకుడివి బౌద్ధులను వెడలగొట్టి హిందూమతము తిరుగ విజృంభించిన కాలమున అనగా క్రీ వె. ఏడు మొదలు పదియవ శతాబ్దముల మధ్యకాలమున చాళుక్యనృపతుల పరిపాలననాఁటివని యభిప్రాయపడియున్నారు కాని ఏశాసనములు స్పష్టపర్చలేవ

**ఉండేదేగట్టి ఊడిపోయినదేపొట్టి** ఆంధ్రలోకోక్తి

**ఉంద్రములోకపిండివంటా? ఊద లోకపంటా?** ఆంధ్రలోకోక్తి

**ఉండ్రాళ్లతద్ది (తృతీయాతిథి)** — భాద్రపద బహుళ తృతీయ. బాలికలు తెల్లవారు జామున మేల్కాంచి భుజించి యాటలాడుకొని గౌరీదేవిని బూజించి యుండ్రములు నివేదన మర్పింతురు (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు) వ్రతవిశేషము.

**ఉండ్రాళ్లచవితి (చతుర్థి)** — విఘ్నేశ్వరుని చవితి చూడుఁడు

**ఉక్కు** — ఇనుము చూడుఁడు.

**ఉక్కుతోఁజేయబడినపొగయోడ నీటందేలుట** — ఉక్కుంబోలిన బరువగు నవన్నియు నీటియందు మునుఁగునుగాని, నీటిపైఁదేలవు. ఏలనన నవి నీటికన్న బరువగు పదార్థములు. మనము ఒక అడుగు పొడవు, ఒక అడుగు వెడలుపు, ఒకఅడుగు దళసరి గల యొకఉక్కు ముద్దను నీటంబడవేసితిమేని యది తోడనే మునిగిపోవును. అనగా నది యొక ఘన అడుగు (Cubic foot) నీటి నవ్వలికిఁద్రోసి యా ప్రదేశమును తానాక్రమించుననిభావము ఒక క్యూబిక్ అడుగు నీరు రమారమి అరువదియైదు పౌనులును, ఒక క్యూబిక్ అడుగు ఉక్కు అయిదువందల పౌనులు రమారమిగను తూగుచుగాన, నీటికన్న బరువగు ఉక్కు నీట మునుఁగునేగాని, నీటిలో దేలను.

ఆ ఉక్కునే ఎనిమిది క్యూబిక్కు అడుగుల ప్రమాణముగల ఒక తొట్టిగఁజేసి నీటంబడవేసితిమేని అది (౮ × ౬౨½ = ౫౦౦) పౌనులబరువు గల ఎన్మిదిక్యూబిక్ అడుగుల నీటిందొలగించవలయును అది అయిదువందల పౌనుల బరువుమాత్రమే గాన (నీటికన్న తేలికయై) నీట మునుంగక తేలును ఈ లెక్కపద్ధతి ననుసరించియే ఉక్కురేకులతో పొగయోడలం జేయుదురు. తొల్లి కఱ్ఱతో చేయుచుండిరి గాని, సముద్రజంతువులవలన నాయోడలు కన్నము చేయబడి నీట మునిఁగిపోయెడివట ఇప్పుడుక్కు ఓడల కాభయము లేదు

**ఉక్కు, మచ్చలు, త్రుప్పు లేకుండుట**— తొల్లింటికాలమున భరతదేశమునం దుక్కు-

ఖడ్గములు, ఇతరవస్తువులుగను చేసి, అనటికవ్వ రసము, కొన్ని జాతుల పనసలు, కొన్ని మూలికల రసములు, కొన్ని తైలములలో నెఱ్ఱగ గాల్చిన వస్తువులను ముంచి పదునిచ్చుచుండిరి పశ్చిమదేశములందుఁ బదునిచ్చుపద్ధతి యున్నను, ఉక్కు అసలుఇనుముచు కార్బైడ్ ఆఫ్ ఐరన్ (Carbide of iron) ను కల్పి కాల్చియుఁ జల్లార్చియు కల్పిసాగగొట్టినదిగా జెప్పఁబడుచున్నది రానురాను ఉక్కును రచించు మార్గము లనేకములు కన్పెట్టఁబడినవి అందు ప్రధానమైనది క్రోమియమ్ (Chromium) సగముచు, ఇనుము సగమును కల్పి తయారుచేయు నుక్కగుచున్నది ఇటీవల క్రోమియమ్ అధికముగా జేర్చి, త్రుప్పుపట్టని యుక్కు తయారుచేయ మొదలిడిరి.

**ఉక్తుఁడు** — పాండవసంతతి క్షత్రియుఁడు తండ్రి నిమి లేక నేమిచక్రుఁడు పితామహుఁడు అసీమకృష్ణుఁడు కుమారుఁడు చిత్రరథుఁడు

**ఉగండాదేశము** — తూర్పుఆఫ్రికా యందు విక్టోరియా న్యాసాసరస్సునకు వాయువ్యదిశగానున్నసీమ ఇది బ్రిటిషుప్రభుత్వమువారి రక్షణయందున్న ఒకటికి స్వదేశ ప్రభుత్వపాలితము లేకుండి స్త్రక్టు అంతయు నిందులోనిది (తూర్పుఆఫ్రికా చూడుఁడు)

**ఉగాది** — సంవత్సరాది చూడుఁడు.

**ఉగ్రదోషము** — జ్యోతిషశాస్త్రమున ముహూర్త భాగమునం దుపనయన ముహూర్తమునుగూర్చి చెప్పఁబడిన దోషములలో నొకటి. లగ్నాది కేంద్రములందు రాహువుండిన ఉగ్రదోషమనియు, వటువునకుం గీడనియు జెప్పఁబడినది.

**ఉగ్రశ్రవుఁడు లేక ఉగ్రశ్రవస్సుఁడు**- తండ్రి రోమహర్షణుఁడు. ఇతడు సూతకులజుఁడు. సకలపురాణవేత్త ఇతనికి సూతుఁడనియు, రోమహర్షణి యనియు వాడుక నామములు కలవు. వ్యాస శిష్యుఁడు నైమిశారణ్యమున శౌనకాదులకుఁ బురాణగాథ లెఱింగించినవాఁడు సకల ఋషి ముని గణములకు వందితుఁడై వారి వలన బ్రహ్మాసనాసీనుఁడుగఁ జేయఁబడినవాఁడు.

**ఉగ్రసేనుఁడు** - యదువంశ క్షత్రియుఁడగు రాజు యమునాతీరమున మధురాపురి యందు రాజ్యమేలినవాఁడు కనిష్ఠ సోదరుఁడు దేవకుఁడు కుమారుఁడు కంసుఁడు కుమార్తె కంసాదేవి, కంసవతి అనువారలు దౌహిత్రుఁడు శ్రీకృష్ణుఁడు కుమార్తె దేవకీదేవి (కంస దేవభాగుని భార్య కంసవతి దేవశ్రవసుని భార్య) ఇంకను జనమేజయ మహారాజు తమ్ముఁడును, పరీక్షిన్మహారాజు రెండవ సుతుఁ డొకఁ డుగ్రసేనుఁడు కలఁడు మఱియుఁ గృష్ణుని సంతతియందు సుబాహు వనువాని పుత్రుఁ డొకఁ డుగ్రసేనుఁడను పేరుగల వాఁడుండెను

**ఉగ్రాయుధుఁడు** — పూరువంశ క్షత్రియుఁడు కృతికుమారుఁడు భీమునిచేఁ జంపబడినవాఁడు.

**ఉగ్రుఁడు** — పరమేశ్వరుఁడగు రుద్రుని ఎన్మిది యాకారములలో నొకటి. అష్టమూర్తి చూడుఁడు

**ఉచ్చనగరము** — జనమేజయ సర్పయాగస్థలము. సంయుక్తరాష్ట్రములలో అహార్, బులాండ్‌షహార్, అనఁబడుచున్నపురము. ఇది ఢిల్లీ మీరట్‌పురములకు సమీపము. గంగాతీరము బులాండ్‌షహార్ అనిన దేశభాష యం దుచ్చనగరమని యర్థము అభిమన్యుని మనుమఁడు, పరీక్షిత్తు కుమారుఁడునగు జనమేజయనృపాలుఁడు దీనిని నిర్మాణముఁ జేసెనట బులాండ్‌షహరున కీశాన్యదిశగా నిరువదిరెండు మైలు దూరమున నిప్పు డహార్ అనంబడుచున్న కొన్ని

ఈతడు బౌద్ధమహాస్వాములలో నొకఁడగు వసుబంధస్వామి శిష్యుఁడు, మహాపండితుఁడు న్యాయప్రవేశమను ప్రసిద్ధ నైయాయిక శాస్త్రగ్రంథకర్త. శంకరుఁడను మహావిద్వాంసుఁడు — భేతాళభట్టు వీరు నవరత్నములనఁబడిన మహావిద్వాంసులు. ఉజ్జయిని నగరమధ్యమున నే మహాకాళదేవస్థానము కలదు. ఆ శివలింగము బహుపురాణప్రసిద్ధము. శివపురాణము ప్రథమ పటలము ౩౮ ౪౬ అధ్యాయములం దీమహాత్మ్యము వివరింపఁబడినది.

భూమిలోనికి క్రిందికి దవ్వఁబడి భూగర్భమున మహాకాళ శివలింగము కలదు. అద్దానిపైనున్న పేఁకగదియందుఁ బరిశునాథ మహాదేవుని విగ్రహము కలదు. దేవాలయావరణముననే కోటితీర్థమనఁబడుచున్న సరస్సు కలదు. దీనికిఁ బడమట ప్రసిద్ధినందిన యీక్షేత్రమున సిద్ధనాథ దేవస్థానమును, మంగళేశ్వర దేవస్థానమునై యున్నవి. అన్నియును గొప్ప దేవస్థానములే. ధ వాతములే. దేవస్థానముఖ ద్వారమున ౨౮ స్తంభములు మంటపద్వారము చక్కని పనితనముగల కన్పురాతన కట్టడము. నగరముయొక్క ఉత్తరభాగమున కాళీయహ్రాద మను బ్రహ్మకుండము కలదు. అది స్కాందపురాణము అవంతీఖండమున ప్రశంసింపఁబడినది. మఱియు నటనే కాలభైరవ దేవస్థానము కలదు. అదియుం బ్రసిద్ధమైనదే. అవంతీక్షేత్రము శిప్రాగంగానదీ తీరమందు దశాశ్వమేధఘట్టము కలదు. అట విధాతయె పది యశ్వమేధయాగము లొనర్చెనట. అచటికి సమీపముననే అంకపాద మనఁబడు (ఇప్పటి అంకపాత్) తావున సాందీపముని యాశ్రమ ముండిన తావు కలదు. ఈయాశ్రమముననే శ్రీకృష్ణ బలరాములు విద్యాభ్యాస మొనర్చిరి. వారు వ్రాసికొను పలకలం గడుగుచుండిన సరస్సునకు దామోదరకుండమని పేరు. నగరమున కుత్తర దిశను రెండుమైళ్ల దూరమున నదీతీరముననే భర్తృహరి గుహాగలదు. అటనాతఁడు యోగాభ్యాస తపము లొనర్చువాఁడట. ఈసందర్భమున విష్ణుశర్మ యను తపోనిధి సుతుఁడగు చంద్రశర్మ నాల్గువర్ణముల కన్యలం బరిణయమై బ్రాహ్మణస్త్రీయందు వరరుచిని క్షత్రియస్త్రీయందు విక్రమార్కుని వైశ్యస్త్రీయందు భట్టిని శూద్రస్త్రీయందు భర్తృహరిని నల్వురు సుతులం గనెను. అందు వరరుచి మహావిద్వాంసుఁడై, తపోనిధి యనంబరగెను. విక్రమార్కుఁడు విక్రమాదిత్యుఁడు అవంతీరాజ్యమేలిన మహారాజు. భట్టి ఆస్థాన ప్రధానమంత్రి. భర్తృహరి నీతిపరుఁడు. విక్రమార్కునకుం బిదప రాజ్యభారము కొంతకాలము వహించి, విరక్తుఁడై సర్వమును త్యజించి విరాగియైనవాఁడు. ఈయన భర్తృహరికావ్యము దేశప్రసిద్ధము. ఈ మహాయోగి సంయుక్తరాష్ట్రములలోని చునార్ కోట (Chunar Fort) లోని రాజభవనమున నొకచో కొంతకాలము వసించుచుండెనని నేఁటికి నాతావాతని పేర బరగుచున్నది.

భర్తృహరి గుహకు భూమిలోనికిం దిగు ద్వారమును సోపానములు మార్గములు, గల చక్కని పనితనముగ్గ మూఁడు అంతస్తులు కలదు? యున్నవి. ఈ క్షేత్రమున గల హరసిద్ధిదేవి దేవస్థానము శక్తిపీఠములలో నొకటి. ఈమె విక్రమాదిత్యమహారాజున కిష్టదేవత యని భేతాళపంచవింశతియందుఁ జెప్పఁబడినది. నగరముయొక్క ఆగ్నేయభాగమునకడగా గోగామహిద్ అని యిప్పుడు వాడఁబడుచున్న నొకపాటిగుట్టపై ప్రసిద్ధమగు విక్రమాదిత్యుఁడు కూర్చుండు సింహాసనము భూమియందుండిన తావనియు దానిని మాళవదేశపు నృపతియైన భోజమహారాజు

దేశస్థులు బొబాక్ అనెదరట. ఈ బొబాక్లు రట్టు వ్యాపకరమగు ప్లేగువ్యాధి క్రిములుండునట. ఇవి సంచరించుచో నెలుకలు తటస్థమగుతరి నాక్రిములు నా యెలుకలందు వ్యాపింప జేయునట. ఆ యెలుకలు వచ్చునట గాని వ్యాధి మాత్రము మనుష్యుల కట్టుకొని వేలు, లక్షలుగ ప్రజానాశనము గల్గించునట. ఉడుతలం దెవ్వరును వేఱొకజాతివి కలవు, కాని, ఇవి యరుదుగ నుండెడివి

**ఉడుతకు ఉడుతభక్తి** — ఆంధ్రలోకోక్తి

**ఉడుతకు ఊరిలో పెత్తనాలు తిండికే** — ఆంధ్రలోకోక్తి

**ఉద్వాండ** — ఇది సుప్రసిద్ధ పారశీకజరథుస్త్రమతస్థుల యాత్రాస్థలము. ఆదిని భరతదేశమునకు వలసవచ్చిన పూర్వులిటనే స్థిరపడి కొంతకాలముండిరట. ఆనాటి యగ్నిదేవాలయము కలదు. అద్దాని యగ్నిజ్వాలలు నిరతము మండుచుండును. దాని నాతష్బెహారామ్ (అగ్నిదేవతాస్థానము) అనెదరు. ఏటేట అడార్ మాసమందును, ఆర్దిబెహెస్ద మాసమందును గొప్ప యాత్రలు జరుగుననియు, పారశీకులు తప్పక తండోపతండములుగ నేతెంచి వచ్చెదరనియు నందురు.

బొంబాయి నుండి బొంబాయిబెరోడా మధ్యఇండియా రెయిల్వేపై, ఉద్వాడ స్టేషను ౧౧౧ మైళ్లును, అటనుండి గ్రామము నాల్గుమైళ్ళును దూరముండును.

**ఉద్యానదేశము** — (ఉజ్జనకదేశము, ఉద్యానకదేశము) దీనిని కొందఱుజ్జనకదేశమనియు వాడుచుండిరట. కొందఱు గాంధారమని పిలువబడు దేశభూమికే యొకప్పుడుద్యానమని పేరుండెననుచున్నారు. గజనీనుండి కాశ్మీరమునకు నుద్యానముండెననిపెక్కండ్రతలంపు. పెషావరున కుత్తరమునను, హిందూకుష్పర్వతములకు దక్షిణమున నుండుదేశమనియు, అనగా చిత్రాల్ మొదలుకొని సింధునదివఱకుంగల సీమయనియు, దర్దిస్థానము, స్వాత్సంస్థానభాగము, స్వాత్‌లోయ యన బడు యూసుఫ్‌జాయిదేశము కలిసి ఉద్యానమని పిలువబడుచుండెనని తలంపబడుచున్నది. మంగళపురము రాజధానిగనుండెను. స్వాత్నదికిం బ్రాల్లింటిపేరు సువస్తు లేక శుభవస్తు. మహాభారతమున అనుశాసనపర్వమునందనను, పద్మపురాణము స్వర్గ ౧౯ అధ్యాయమునను దీని ప్రశంసలు కలవు. ఇందు పద్మపురాణమున ఉద్యానకదేశమని పేర్కొనబడినది.

డాక్టరు స్టెయిను (Dr Stein) పండితుని పరిశోధనలనుండి ఉద్యానదేశము ఇప్పటిచిత్రాల్ రాజ్యభూములు, యాసిన్‌నుండి సింధునదీతీరప్రదేశములకు డా, గిల్గిట్, బిలాస్, బుంజీలను గలుపుకుని కృష్ణగంగ (ఇప్పటి కిషన్‌గంగ) లోయ వరకును కాశ్మీరదేశపు టుత్తరసరిహద్దున వ్యాపించియుండిన దేశమని చెప్పబడినది. దరదదేశమొకప్పు డీదేశభాగమైయుండెనని కొందఱనిరి, కాని, నిదర్శనములు గానరాకున్నవి.

**ఉడ్డియాణబంధముద్ర** — యోగాభ్యాస విధానమున జెప్పబడిన వింశతిముద్రలలో నొకటి. నాభిస్థానమును వెన్నెముకకంటునట్లు లోనికి కొక్కుట ఉడ్డియాణబంధముద్రయనబడును. ఈ యభ్యాసమువలన ప్రాణవాయువు సుషుమ్నామార్గమున బ్రవేశించుననియు, ఇది యుపమృత్యువు గల్గకుండ గాపాడుననియుం జెప్పబడినది

**ఉతకాలకుల గోత్రము** — ఉద్వాహకుల చూడుడు

**ఉతథ్యగోత్రము** — ఔతథ్యఉపగణము చూడుడు

**ఉతథ్యుఁడు** — తండ్రి అంగిరసుఁడు. సహోదరుఁడు బృహస్పతి. భార్య పేరు మమత కుమారునిపేరు దీర్ఘతముఁడు కారణాంతరమున ఉతథ్యునిభార్య బృహస్పతివలనఁ భరద్వాజమహర్షిని కనెను

**ఉత్కచ తీర్థము** — పాండవులు ధౌమ్యుని పురోహితునిగఁ గైకొనినతావు

**ఉత్కటాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి రెండు పాదముల వ్రేళ్లను నేలకానించి, రెండు మడమలనుపై కెత్తి పిరుదులక్రిందనుండునటుల నుంచి కూర్చుని యుండుట యుత్కటాసన మనఁబడు ననియు, దీని యభ్యాసమున శ్వాసము స్తంభించు ననియు, ప్రాణవాయువు సుషుమ్నానాడీగతమగు ననియుఁ జెప్పఁబడినది

**ఉత్కల దేశము** (ఉఢ్ర లేక ఓఢ్ర దేశము) — దీనిని సర్వసాధారణముగ, ఒడ్డె దేశమనుచున్నారు ఇది ఓఢ్ర శబ్ద పరిణామ రూపమేగాని వేఱుకాదు ఈదేశస్థులు తమ దేశమున కృష్ణార్క, పార్వతీహార క్షేత్రములు నాల్గు మహాపవిత్రస్థలము లుండుటచేత నద్దానిని పవిత్రభూమి యని గర్వముగ ననియెదరు ఇట్టి మహావైభవముగల్గిన దేశమునందనేక రాజధానులు మారియుండుటచేత రాజధానులంగూర్చి వ్రాయుటకన్న పురములంగూర్చి వ్రాయుటయె సముంజసముగ నుండెడిని

ఇక్కాలమున నీదేశమునఁగల పుణ్యక్షేత్రములలో నెల్ల కృష్ణక్షేత్రమగు జగన్నాథము ప్రధానమైనది. దీనినిప్పుడు పూరీ యనుచున్నారు. పురుషోత్తమక్షేత్ర మను పేరిటను మారినది. ఇచట జగన్నాథస్వామి దేవస్థానము చాల గొప్పది బహుధనవంతము పెక్కు యాత్రస్థలిటకు తండోపతండములుగ ననుదిన మేతెంచుచుందురు విష్ణుదేవునికిది భోజనస్థానమందురు గాన నిచ్చటి విరాజిత నైవేద్యములు (భోగములు) నడచుచుండును. మఱియు నిట ప్రసాదమును వర్ణవిభాగమును పాటింపక నెల్లరు కలిసి భక్తితో భుజించుచుందురు

పిదపఁ జెప్పఁదగినది భువనేశ్వరము ఇది హరక్షేత్రము. ఇచటి దేవాలయము గొప్పది, చాల పనితనముగల్గినది ఈక్షేత్రమున దేవళములు పెక్కు గలవు పెక్కు దేవళములు పాడగుచున్నవి ప్రధానదేవళము లింగరాజస్వామిది ఎక్కువ పనితనముగల్గిన దేవళము రాజారాణి దేవళమనఁబడునది, ఇది ప్రతిష్ఠ కానేలేదు ఎక్కువ పురాతనమగు దేవళము పరశురామేశ్వర మనఁబడునది ఇచట బిందుసరోవరమను పుణ్యతీర్థము కలదు ఆసాగరమును లలితేంద్రకేసరి యను భూపతి విరివిగఁ ద్రవ్వించి బాగుచేయించెను మఱియొక స్నానతీర్థము గౌరీకుండమనఁబడు నీటియూట ఇటనే కేదారకుండమను చిన్న నీటియూట కలదు దాని జలము లారోగ్యప్రదములని యందురు తొల్లి భువనేశ్వరముండిన తావనను చుట్టుపట్ల నిప్పటికి నున్న యరణ్యము ఏకాంబ్రవనమని చెప్పఁబడినది భువనేశ్వరమునకుఁ గతిపయదూరమున ఖాండగిరి, ఉదయగిరి యను రెండు చిన్నమిట్టలపైఁ దొలువఁబడిన గుహాలు కలవు ఇవి యిప్పుడు కాళీగానున్నవి ఇట కొండపై జైనదేవాలయమును, క్రింద జైనుల సత్రమును కలవు ఇట శ్రీరాముఁడు జైనుఁడై స్వర్గమున కేగెనని యచటి జైనులందురు

ఉత్కలమును కళింగరాజ్యముతోఁ గల్సి కొంతకాలమును, వేఱుగఁ గొంతకాలమును పరిపాలన నడచెను భువనేశ్వరము రాజధానిగ కేసరివంశ నృపతులలో యయాతికేసరి (మొదటి

౪. సాంతోబ్రాహ్మణశాఖ- ఇందా రంత శ్శాఖలు గలవు. ౧ గువాతోరియాసాంతోశాఖ, ౨ నొందాసాంతోశాఖ, ౩ బాకీశోకలియా సాంతోశాఖ, ౪ గాకొన్నసాంతో, ౫ సోర్బా పాడియాసాంతోశాఖ, ౬ బాకీనోపలియా సాంతోశాఖ

౫. అగ్రభక్షులు శ్రోత్రియులలో నొక తెగ గౌడబ్రాహ్మణులలోని అగ్రదానీలవలెనే అపర కర్మములు ప్రేతకార్యములందు, దానములందు చుండు శాఖవారు

౬. మాటియాలు పౌరోహిత్యము ముఖ్య వృత్తి వైతరిణీనది మొదలు, గంగానదివఱకు స్నానము లొనర్చువారికిఁ గర్మం జరిపించు వృత్తిఁ గల్గి తీర్థములందుఁ గానవచ్చుచుందురు

౭. తెలీబ్రాహ్మణులు (తెలుకుల బ్రాహ్మణులు) శ్రోత్రియబ్రాహ్మణశాఖ, వృత్తిపౌరోహిత్యము

౮ శ్రోత్రియబ్రాహ్మణులు వీరి ముఖ్యవృత్తి పౌరోహిత్యము

౯. సాహుబ్రాహ్మణులు వర్తకులగుట నీ పేరయ్యె నందురు

౧౦ కొటకీబ్రాహ్మణులు వీరిం గూర్చి తెలియరాకున్నది.

౧౧ చిటకీబ్రాహ్మణులు వీరింగూర్చి తెలియరాకున్నది.

**ఉత్కలితము** — తీసివేయుట లేక తగ్గింపు చతుర్విధ గణితములలో నొకటి (గణితము చూడుఁడు).

**ఉత్కలుఁడు** — తండ్రిపేరు ధ్రువుఁడు పెద్దకుమారుఁడు. కనిష్ఠసోదరుఁడు వత్సరుఁడు. బాల్యమునందే జ్ఞానియై తండ్రిరాజ్యమెల్ల నిరాకరించినవాఁడు.

**ఉత్కృష్టదృష్టిర్నికృష్టేఽర్థా నిత నైతి న్యాయము** — ఉన్న ఒకస్థితినివీడి దానికిపై (ఉత్కృష్ట) స్థితినందపలెననిన, వేఱొక ఉత్కృష్టపదార్థము ఉన్నతావు నాధారముగ (పునాదిగ) నిడికొని దానిపై నుండి యొదవలయు నని భావము అట్లఁగా నొక ఉత్కృష్టస్థితి నాధారముగఁ జేకొని దాని నవలంబించి తద్వారా ఉన్నతస్థితి నందవలెననుట కీన్యాయము వర్తించెడిని.

**ఉత్తచేతి మూరకొలత** — నిరర్థకమని భావము (అప్రశస్తోక్తి)

**ఉత్తమకుల గోత్రము**- ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి వైశ్యగోత్రములు చూడుఁడు ఉతమకుల (ఉత్తమకుల, ఉతకాలకుల) గోత్రము, ద్వాదశీయ (౧౩) గోత్రము, సంస్కృతగోత్రము ఉత్తమోజస, ఉత్తమోజ గణము, నారదర్షి, ఆపస్తంబ యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప వగఖండ సమానగోత్రములు, నార్యకౌత్తమోజస, ఉత్తరేశుఁడు దేవత, ఉదకాంబభార్య, హేమాచలము తపస్థానము, ఉత్తరాబ్ధితటాకము, జపము కోటి, దీపములు ౩౫, క్షేత్రసంఖ్య ౭౯, జలము దానము, ఉత్తరేణి వృక్షనీయము

**ఉత్తమమనువు** — తండ్రి ఉత్తముఁడనియు, తల్లి బహుళాదేవియనియు, ఈతని కాలమున సుశాంతి యింద్రుఁడనియు, వసిష్ఠసంతతి వారగు సుతేజ సంతపాదులు మహర్షులనియు మార్కండేయ పురాణమునఁ గలదు ఇతర తావుల ఉత్తమమనువు ప్రియవ్రతుని పుత్రుఁడనియు, తామసమనువునకు జ్యేష్ఠసోదరుఁడనియు, విష్ణుభక్తుఁడనియు, ఈమ, ఊర్జ, భార్గ, శుచి, శుక్ర, మధు, మాధవ, నభస్య, నభ

సవాలు లను పదిమంది పుత్రులనియుఁ గానవచ్చె డిని చైత్రశుద్ధ తృతీయ ఉత్తమమన్వాది

**ఉత్తమాంగాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. పద్మాసనముగ మరము వైచుకొని కూర్చొని (పద్మాసనము చూడుఁడు) అరచేతులను ఎకటివైపు నేలకానించి యాచేతుల యూనికబలమున శరీరమును పైకిలేవనెత్తుట ఉత్తమాంగాసనము. ఇందువలన శరీరమునకుఁ జల్లదనముగల్గి కుండలినీప్రబోధమగునని చెప్పఁబడినది.

**ఉత్తమానసరోవరము** — కాశ్మీరదేశమునందు హరికేశ్వరక్షేత్రమునకడ యున్నట్టి గంగాబాల్ సరస్సునకీ పేరుకలదు.

**ఉత్తముఁడు** — ఉత్తమ మనువు పేరందరొకరికిగి దే... మరియు నుత్తానపాదునకు సూనీతికిని జనించిన సుతుఁడొక డుత్తముఁడను వాఁడొకనాఁడు అడవికి వేటకుఁజని యొకయక్షునిచే నిహతుఁడై యుండ నాతని తల్లి వెదకుచు బోయి కళేబరముఁ గాంచి దుఃఖితయై తానును మరణించెను

**ఉత్తమౌజుఁడు** — తండ్రి ద్రుపద మహారాజు. భారత యుద్ధమున బదునెన్మిదవ నాఁటి రాత్రి యశ్వత్థామచే నిహతులైనవారిలో నొకఁడు ద్రుపదుఁడు చూడుఁడు

**ఉత్తర** — విరాట్రాజకుమార్తె. ఉత్తరుని చెల్లెలు. అభిమన్యుని భార్య. పరీక్షిత్తుమహారాజు తల్లి. ఈమె పరీక్షిత్తును గర్భమున గల్గియుండు తరి భారతయుద్ధమున నభిమన్యుఁడు నిహతుఁడాయెను. అట్టితరి నశ్వత్థామ యామెగర్భస్థుఁడైన (పరీక్షిత్తు) బాలుని జంప వదలిన యస్త్రమీయామె గర్భశోధన మొనర్చుతరి శ్రీకృష్ణుఁడాబాలుని రక్షించి యస్త్రోపసంహారమొనర్చెను. దీనింబట్టి ఆబాలునకు పరీక్షిత్తని నామమిడిరి

**ఉత్తర(ఉత్తరఫల్గుణి) నక్షత్రము**— ఇది ఫల్గుణీ నక్షత్రమందలి యుత్తరార్ధము. ఆకసమున నిదియు పూర్వఫల్గుణియుఁ గలసి నేత్రాకారముగా నున్నవి. రెండు నక్షత్రములు కూడియుండు నక్షత్ర వితతి. దీనికింగల పర్యాయపదము... ఆర్యమ్ల, ఆర్యమ్ణుం, ఆర్యమణం, ఉత్తరా, ఉత్తరఫల్గునీ అనునవి కలవు. దీనికి ఆర్యమ్ణు డధిదేవత మనుష్యగణము, ఊర్ధ్వముఖము స్త్రీస్వభావము, ఎద్దు, మామకుత్తి, పక్షి, రేగుచెట్టు ఈ నక్షత్ర సంబంధములనియు, ప్రవేశించిన పగుడన్నిని ఘుడియలపై త్యాజ్యమనియు, చివరి రెండు ఘుడియలపై నమృతమనియు, ఇది స్థిరస్వభావ నక్షత్రమనియుఁ జెప్పఁబడినది. పుబ్బ (పూర్వఫల్గుణి) నక్షత్రము చూడుఁడు.

**ఉత్తర ఉరిమి వర్షించినా, పాము కరచినా తీరకపోదు** — ఆంధ్ర లోకోక్తి

**ఉత్తరకన్నడజిల్లా** — దీనికి కార్వార్ (కార్వాడ) జిల్లాయనియు నంటురు. బొంబాయి రాజధాని లోనిది.

**ఉత్తర కుమార ప్రజ్ఞలు** — భారతమున విరాట్రాజ సుతుఁడగు ఉత్తరకుమారుఁడు (ఉత్తరుఁడు) ఉత్తర గోగ్రహణోన్ముఖుఁడై తన ప్రతాపమును తాఁజెప్పుకొనినట్లు వివరింపఁబడినది. ఇక్కాలమునఁ దనశక్తికి మించి ప్రజ్ఞలం జెప్పుకొను బడాయిమాటలను సామెతగా నుత్తరకుమార ప్రజ్ఞలని హేళనగా వాడుచున్నారు

**ఉత్తరకురుదేశము** — గద్వాల్ పాలెండ్ల దేశములందలి ఉత్తరభాగములు కలిసిన దేశభాగమునకుత్తరకురుదేశమని యొకప్పుడు పేరుండెనని చెప్పఁబడినది. తొల్లియొకప్పుడు

హిమాలయపర్వతశిఖరప్రదేశము కూడ కొంత యిందు చేరియుండెనని తెలుచున్నది. ఐతరేయ బ్రాహ్మణము (౮ ౧౪ ౪) నందు చైత్రరథమను కాననమును, మందాకినీనదిని గల్గిన దేశముగ చెప్పబడినది. మహాభారతము వనపర్వమున నీసంగతి కలదు.

**ఉత్తరకొంకణము జిల్లా** — థానా జిల్లా బొంబై రాజధాని చూడుడు.

**ఉత్తరకోసల దేశము** — ఆదిని కోసలమంతయు ఒకదేశముగ నుండి దోలేదో సరిగా తెలుపు బరికరములు లభింపకున్నవి గాని, దిలీపమహారాజు నాటికే ఉత్తరదక్షిణ కోసలములు రెండుగనున్నట్లు మహాకవి కాళిదాసు రఘువంశము చతుర్థసర్గ మొదటి శ్లోకమున వివరించియున్నాడు. శ్రీరాముని పిదప ఉత్తరకోసలము లేదా నుత్తరకోసలమనియు, కోసలమనియు రెండుభాగములాయెను. దక్షిణకోసలము (తొల్లింటిది) మహాకోసల మనబరగెను. ఉత్తరకోసల బహరైచ్ మొదలగు ప్రాంతము దీనిరాజధాని శ్రావస్తి ఇక రెండవది యగు కోసలకు రాజధాని కుశావతీపురము దీనిని కుశుడు నేలెనందురు. రామాయణము ఉత్తరకాండమునందియు నుపద్మపురాణము ఉత్తర ఖండ మందును నీవిషయము కలదు. మఱియు "Sanskrit Buddhist Literature of Nepal by Dr R L Mitra అను గ్రంథమునందు జక్కగ వర్ణింపబడినది (ఇందు మహాకోసల చేరలేదు)

శ్రీరామ సుతులగు కుశ లవుల వలకు నయోధ్య కలసియుండిన ఉత్తర కోసలకు రాజధాని యగుట తెల్లమే. అయోధ్యకు సాకేతపురమనియు పేరుండెను. ఇది సప్తమోక్షదాయక పురములలో నొకటి. సూర్యవంశపు రాజులకు రాజధానియైయుండిన నగరము. అనాటి భూపతుల కిలవేల్పగు నాగేశ్వరనాథ శివాలయ మయోధ్య యందు గలదు. సరయూ నదీతీరము. సరయూనదిని రామగంగ యనియునందురు. వైవస్వతమనువు మనుమడగు వికుక్షి కుమారుడగు కకుత్స్థుడు (పురంజయుడు) అయోధ్యను నిర్మించి రాజధానిగ జేసెనని తన పరిశీలనలనుండి జేమ్సు టాడ్ (Leut Col James Todd) పరిశీలకుడు నుడివియున్నాడు.

ఉత్తరకోసల కోసల విభజింపబడిన పిదప ఉత్తరకోసలకు శ్రావస్తిపురము రాజధాని యయ్యెను. ఇక్కాలమున సాహెత్ మాహెట్ అనుచున్నారు. తొల్లింట ధర్మపట్టణమని పేరుండెను. అచిరావతి లేక ఐరావతి నదీతీరము. ఇది సరయూనది యొక్క చేయు ఉపనది. దీని నిప్పుడు రప్తీనది యనుచున్నారు. దీని ప్రశంస వరాహపురాణము ౧౧౪ యందు కలదు. రెండవది యగు కోసలకు రాజధాని యనబరగిన కుశావతి కుశాభవనపుర మనియు కుశస్థలి యనియు పేరులుండెను. ఇప్పటిపేరు సుల్తాన్పూర్. గోమతి (ఇప్పటి గుమ్తీ) నదీతీరము. క్రీ పూ ఆరు ఐదు శతాబ్దములనాడె గౌతమ బుద్ధభగవానుని కాలమున మహా కోసల బలమగు రాజ్యమైయుండెననియు, బనారస్, కపిలవస్తు పురములు చేరియుండెననియు, శ్రావస్తి రాజధాని యనియు బౌద్ధ గ్రంథములందు గానన గుం గాని క్రీ పూ 300 నాటికి కోసల మగధకు చేరిపోయియుండెను.

ఉత్తరకోసల నేలిన భూపతులు సూర్యవంశపు రాజులుగాన వేఱుగ నుడువనక్కర లేదు. కాని ప్రసేనజిత్తుడను భూపతి బుద్ధభగవానుని సమకాలికుడు. ఈయన బౌద్ధమతము స్వీకరించినవాడు. బుద్ధభగవానుని విగ్రహము బంగారముతో

నుండకు కొందఱు పరిశీలకులు పైపొర నీరు చాలుగను టక్రిందిలోతులందు నీరుప్పగను నుండుననుచున్నారు ఉత్తరధ్రువము చుట్టు నీరు ఘనీభవించిన మంచును, దానిచుట్టు నీటి యందుఁ దేలుచుండు మంచుగడ్డ (Iceberg) ల సమూహమును కలవు ఇవియన్నియు గ్రీను లాండునందలి గ్లేసియరులనుండి విడఁబడి నీట దేలుచు దూరముగఁ బోవుచున్నారు

ఉత్తరదక్షిణ ధ్రువములందు సూర్యుని ఉత్తర దక్షిణాయనముల మేరకుఆరునెలలొకేకగ పగలుగను, ఆరునెలలొకే రాత్రిగను ఉండును అట్టి పగటి యందర్ధరాత్రమునను సూర్యుని జూడగలుగు నదృశ్యమును Midnight Sun అనియెదరు

**ఉత్తరధ్రువరేఖ** (Arctic Circle)— ఉత్తరధ్రువరేఖ ఉత్తరధ్రువమునకు దక్షిణపు టెల్లగా భావింపఁబడిన రేఖ ఇది భూమధ్యరేఖను డి ఉత్తరముగా నరువదియారున్నర డిగ్రీల దూరము నందున్నది మఱియు నుత్తర ధ్రువమును డి దక్షిణముగా నిరువదిమూడున్నర డిగ్రీలదూరము నుండు సరిహద్దును తెలుపు రేఖ ఈ రేఖ పటములందు భావింపఁబడి లిఖింపఁబడు చిహ్నము గాని, నిజముగ భూమిపైఁ గాన్పించునది కాదు

**ఉత్తరపంచనదములు** — పంచనదములు చూడుఁడు.

**ఉత్తరపథము** — కాశ్మీరము, ఆఫ్ఘనిస్థానరాజ్యప్రాంతముల కీపేరుండినట్టుల గుశీంవ శాసనమునుండి తెలియుచున్నది దీనిగూర్చి Journal of Asiatic Society of Bengal 17 P 492-498 యందు వివరింపఁబడి ది

**ఉత్తరపాంచాల దేశము** — ఈదేశముగూర్చి సరిగా నేమియుఁ దెలియరాకున్నది ఇప్పుడీదేశమును రోహిల్ఖండమని యనుచున్నారు ఈ పేరు రోహిల్లా మహమ్మదీయులవలనఁ గల్గిన సహిగనామముగ నుండనోపు. ఉత్తరపాంచాలమున కహిచ్ఛత్రపురము రాజధానియైయుండెను. అహియనిన పాము ఇట పాము పడగయని భావము ఛత్రమనిన గొడుగు మహాభారత కాలమున ద్రోణాచార్యుఁ డడవి నొకచెట్టుక్రింద నిద్రించువాని కొకపాము పడగవిప్పి మోమున కెండతగులకుండ గొడుగువలె అచ్ఛాదము పట్టుచుండఁగాంచి, అది మహారాజయోగలక్షణముగ నెంచి నీవు భూపాలుండవగుదువని యాతనితో ననెనియు, అతండట్లె భూపాలుండాయె ననియు, అతని పేరు ఆది శేష అధిరాజనియు, దానినుండియే అహిచ్ఛత్రపురమనియు, నతనిచె డి కొందఱు వాడినట్టి అధిఛత్రపురమని పేరయ్యెననియు బలమగు ప్రతీతి యాదేశమునఁ గలదు

ఇప్పటి బరెయిలీపురమునకుఁ బశ్చిమముగా నిరువదిమైళ్ల దూరమునగల రామ్నగర్ అను గ్రామపు పరిసరమునందున్న పాటిదిబ్బల నహిచ్ఛత్రపురముండిన తావుగఁ దెల్పియున్నారు ఒకప్పుడపురముగ కధిరాజకోటయని లేక అధికోటయని కూడ పేరుండెనట ఇప్పుడట నొక పాడైన దుర్గము కలదు అద్దాని నధికోట యనుచున్నారు క్రీ వె ౭వ శతాబ్దమున చీనా యాత్రికుఁడగు హ్యూన్ చ్వాంగు దర్శించినట్లు తన యాత్రా చరిత్రమున వ్రాసియున్నాఁడు అందు కోట వెలుపల నాగహ్రదము (సరస్సు) కలదనియు, అట నొక నాగవంశస్థుఁడగు భూపతి బౌద్ధుఁడై గొప్ప పడగవిప్పిన నాగమును, దాని నీడను బౌద్ధవిగ్రహమును ప్రతిష్ఠించెననియు, క్రీ పూ ౨౫౦ లో నశోకచక్రవర్తి అక్కడ నొక స్తూపమును నిర్మించి, అహిచ్ఛత్రస్తూపమని పేరిడెననియు వ్రాసెను కోట గోడలు పడిపోవుచున్నవి. కొంచెము కొంచెము లోపములతో చతురస్రమైనది ముప్పదిరెండు బురుజులుండెననియు, అవి ముప్పది యడుగుల యెత్తుగలవనియు, పశ్చిమ

**ఉపప్లుతా** — ఆయుర్వేదవైద్యశాస్త్రమున స్త్రీల మర్మావయవ సంబంధరోగమునకు ఉపప్లుతరోగమని పేరు

**ఉపమన్యు (ఉపమ) కులగోత్రము** — ఆర్యవైశ్యుల (౧౦౨) గోత్రములలో నొకటి (వైశ్యగోత్రములు చూడుడు) ఉపమన్యు (ఉపమ) కులగోత్రము, త్ర్యార్షేయ (౭) గోత్రము, సంస్కృత గోత్రము, వామదేవస, బృహదుక్థగణము, ఆపస్తంబసూత్రము, యజుశ్శాఖ, ప్రమాణ గ్రంథము మాత్స్యసూత్రము, కుంభేశుడు దేవత, భార్య కోనాంబ, మలయాద్రితపస్థానము, కోనసరస్సుతటాకము, జపములకు దీపములు ౭౩, క్షేత్రసంఖ్య ౭౩, అన్నదానము, పిప్పలి వర్జనీయము

**ఉపమన్యు గోత్రము** — ఉపమన్యు గణము చూడుడు

**ఉపమన్యు గణము** — (వశిష్ఠసంతతి) ఇందు ౮౬ గోత్రములు కలవు

బౌధాయనసూత్రోక్త గోత్రములు ౨౩ ౧. అనుకురి, ౨ ఆంవామర, ౩ ఉపమన్యు, ౪ ఉపగవ, ౫ ఔద్గాహాయని, ౬. కపికేశి, ౭ కాపిజల, ౮ కావాథి, ౯ కుందోదరాయణ, ౧౦ జరూలోక, ౧౧ జాలాగత, ౧౨. త్రైవర్ణ, ౧౩ పాపాగిరి, ౧౪ భాగవిత్తాయన, ౧౫ మహాకర్ణాయన, ౧౬ మాండలేఖ, ౧౭ లాక్ష్మణేయ, ౧౮ లావాని, ౧౯ పలాయని, ౨౦ వాకాశ్వి, ౨౧ వాలశిఖ, ౨౨. శైలాలి, ౨౩ సురాక్ష

కాత్రీయసూత్రోక్త గోత్రములు ౨౬- ౧ అప, ౨ ఔపలేఖ, ౩ ఔలపి, ౪ శశానేయ, ౫. కారకృత్, ౬. కౌరవ్య, ౭ గోఅధ, ౮ దశేరక, ౯ దావాల, ౧౦ దాసకాయన, ౧౧ రుహిత, ౧౨. పార్ణాగార, ౧౩ పాదకాయన, ౧౪ ప్రాలంబాయన, ౧౫ బ్రహ్మావలి, ౧౬. భాగహి, ౧౭ భాగురాయణ, ౧౮ మాయశిరావి, ౧౯ వాహ్యావాక్య, ౨౦ శాండోదరి, ౨౧ శావార్య, ౨౨. శైలావి, ౨౩ సాక్ష్యాయన, ౨౪ సారాయణ, ౨౫. సావ్యాపత్య, ౨౬. శిరి

మాత్స్యసూత్రోక్త గోత్రములు ౨౦- ౧ ఉద్రాహ, ౨ ఉపలయ, ౩ కృష్ణ, ౪ కాణ్యాం ౫. క్రోధిన, ౬ కోశ, ౭ కామార, ౮ తరోగణ, ౯ దాకాయం, ౧౦ బాలకి, ౧౧ మహాకణ్వ ౧౨ మానేయ, ౧౩ రావణ ౧౪ వలేబల, ౧౫ వాకి, ౧౬ శాణ్బలీయ, ౧౭ శాకిహారు, ౧౮ శాకాయన, ౧౯ శ్యాని, ౨౦ సుహాక

ఇతరగ్రంథోక్త గోత్రములు ౧౮- ౧ కరకర్క్రదాసి, ౨ కాజపాయన, ౩ కారపులి, ౪ కాలకి, ౫ గోపోదతి, ౬ ధాతుహి, ౭. నాహులి, ౮ పాదకాయన ౯ పాధుశ్రవ, ౧౦ మారాయణ, ౧౧ ముంచికాయన, ౧౨ రాస్వేని, ౧౩ రౌక్ష, ౧౪ వాహులి, ౧౫ శాప్యాయ, ౧౬ స్కాంబాయన, ౧౭ హేమకుశి

ఈ ఉపమన్యు గణమునందలి గోత్రములకు ప్రవరరూపములు ౩- ౧ వశిష్ఠ- ఇంద్రప్రమద, ఆభరద్వసు ౨ వశిష్ఠ- ఆభరద్వసు, ఇంద్రప్రమద ౩ ఆభరద్వసు- వశిష్ఠ, ఇంద్రప్రమద

**ఉపమన్యు గోత్రము** — జాతుకర్ణ్యగణము చూడుడు

**ఉపమన్యువు ఋషి** — ఈఋషిసత్తముడు గొప్పశివభక్తుడు ప్రముఖులలోనెన్నఁబడిన వాఁడు ఆయోదుఁడను నామాంతరము గల, ధౌమ్యుఁడితని గురువని చెప్పఁబడినది.

అరుణి, వేదుఁడను వారలుగూడ ఆగురువునకే శిష్యులగుట, వానినుపమన్యునకు సహాధ్యాయు లనియుందురు. ఉపమన్యుఁడు మిగుల గురుభక్తి గలవాఁడట. అశ్వినీదేవతల వరము వలన ఉపమన్యునకు స్వర్ణదంతములు గల్గె ఁయు, సకల విద్యా పారంగతుఁడనియు మహాభారత, ఆదిపర్వ, (పౌష్య) తృతీయాధ్యాయమునఁ జెప్పఁబడినది. ఈమహాత్ముఁడు మాహేశ్వర సూత్రములకు నందికేశ్వరకృత యుపోద్ఘాతమునకు వ్యాఖ్యను రచించినవాఁడు (మాహేశ్వర సూత్రములు చూడుఁడు) ఈతనితండ్రిపేరు వ్యాఘ్రపాదర్షి యని తెలిసెడిని. ఆయనకు వ్యాఘ్రపాదములఁగోలిన పాదములుండెనందురు. ఈతఁడొక వ్యాకరణము వ్రాసెనట గాని యది కానరాకున్నది.

**ఉపమితి గోత్రము** — విష్ణువృద్ధగణము చూడుఁడు.

**ఉపయన్నపయన్ధర్మో వికరోతిహి దర్మిణమితిన్యాయము** — గుణముగాని, లక్షణముగాని కన్పించుట లేక అదృశ్యమగుట వలన (కిరి లేక దరిక్ర మొక్క)స్థితి లక్షణములుకు మార్పుఁజెందునని నుట కీన్యాయము వాడుదురు.

**ఉపయాజుఁడు** — గంగాకూలమున నివసించుచుండిన యొక వ్యాసశిష్యుఁడు ద్రుపద మహారాజుచేత యాజుననితోసహా యాగము చేయించినవాఁడని తెలియుచున్నది.

**ఉపరత్నములు** — గోమేధికము, గారు రత్నము, పద్మరాగము, వైడూర్యము, ప్రవాళము (పగడము), కాచము (గాజురాయి), స్ఫటికము, శుక్తి (ముత్యపుచిప్ప), శంఖము (శంఖముతోఁ జేయఁబడిన పూసలు, పలకలు మొదలగునవి యని భావము) ఈతొమ్మిదింటి నుపరత్నములని చెప్పుదురు.

**ఉపరసములు** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున (గౌరసీపు) హింగుళ, అభ్రక, తాళక, శిల, స్రోతాంజన, టంకణ, రాజావర్త, కాంతలోహ, స్ఫటిక, శంఖ, ఖటీ (నావసుద్ద), గైరిక, కాసీస, రసక (కపరితుత్థము), కపర్ది (గవ్వ), కంకుష్ఠ, సౌరాష్ట్ర ములను ఉపరసము లని చెప్పఁబడినది.

**ఉపరిచరవసువు** — అత్రి, చంద్ర, యాగ, కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి, సుధన్వు కుమార్లు బృహద్రథుఁడు, కుశుఁడు, మత్స్యుఁడు, ప్రత్యగ్రుఁడు, చేదిపుఁడు అనువార్లై రుగురు సత్యవతియనుకుమార్తెయును గలదు. ఈమె యమునానది యందు శాపవశయై యున్న అద్రిక అను అప్సరకు జనించినది.

**ఉపరిశిష్టకులగోత్రము** — విపరిశిష్టకుల చూడుఁడు.

**ఉపలయుగోత్రము** — ఉపమన్యుగణము చూడుము.

**ఉపలావృతారణ్యము** — నవారణ్యములు చూడుఁడు.

**ఉపలోధగోత్రము** — శండిలగణము చూడుఁడు.

**ఉపలోహములు** — స్వర్ణము, తారము (వెండి), రాగి, నాగము (తగరము), రసము (రసాంజనము), కాంతం(కాంతలోహము), తీక్ష్ణం (తీక్ష్ణలోహము), ముండా (మాండూర లోహము) ఏడికుపలోహములని ఆయుర్వేద వైద్యశాస్త్రమునఁబేరు.

**ఉపవాయువులు** — పంచవాయువులు చూడుఁడు.

**ఉపవాసము** — హిందువులకుఁ గొన్ని పవిత్రదినములు ఉపవాసదినములుగఁ జెప్పఁబడినవి. శైవులందు మహాశివరాత్రి, కార్తీక సోమవారములు, మాసశివరాత్రులు అరుదుగఁ గొందఱ కన్నిసోమవారములు పవిత్రదినములుగ

ముపవాసములుగఁ జెప్పఁబడినవి. వీరి ఉపవాసము పగలంతయు నని భావము సాయంకాలమున వీరు శివపూజనొనర్చి భుజింతురు వైష్ణవమతస్థు లేకాదశులు మొదలగు దినములందు పగలు రాత్రియుఁగూడ భోజనము జేయక యుపవసించి మరునాఁడుదయమున (ద్వాదశి) భోజన మొనర్తురు మధ్వులు నట్లచేతురు ఇంకి స్మార్తవులందరివియు నవియుఁగూడ పాటించుట కలదు. శివసంబంధదినములందు శైవులవలెను, విష్ణుసంబంధ దినములను వైష్ణవులవలెను ఆచరింతురు. మహమ్మదీయులందు రమదాను మాసమున సూర్యోదయాత్పూర్వము భుజించి పగలంతయు అనఁగా సూర్యాస్తమయపర్యంత ముపవసించి పిదప భుజింతురు ఇట్లు వేళ్వేఱు మతస్థులందు వేఱ్వేఱువిధముల నుపవాసము లాచరింపఁబడుచున్నవి. "ఉపవృత్తస్య పాపేభ్యో యస్తు వాసో గుణైస్సహ। జీవాత్మపరమాత్మనోః । ఉపవాసస్సవిజ్ఞేయః।" అని చెప్పఁబడియుంట దైవసన్నిధి గల్పించుకొని దైవచింతనతో నుపవాసమొనర్పవలెనని హిందువులపద్ధతియు, ఖురాన్ప్రకారమున రోజావ్రతము సలుపుచు రమదాన్ మాసపు ఉపవాసములు సలుపవలెనని ఇస్లాంమతపద్ధతియు నొక్కటిగఁ దగినది

**ఉపవాసాద్వరంభిక్షా** — ఉపవాస ముండుటకన్న భిక్షాటనము మేలని యర్థము మఱికొన్ని సందర్భముల భిక్షాటనముకన్న ఉపవాసము మేలనియుం గూడఁ జెప్పఁబడినది. ఈన్యాయము స్పష్టోపయోగము కలదికాదు

**ఉపవిందు గోత్రము** — కౌశధ్య ఉపగణము చూడుఁడు.

**ఉపవిషములు** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున అతివస, జిల్లేడు, గన్నేరు (వేళ్లు), ఉమ్మెత్త, పొత్తిదుంప, కాడచెముడు, ఉపవిషము లందురు.

**ఉపశమానుస్మృతి** — దశదానాన స్మృతులు చూడుఁడు

**ఉపసంజనిష్యమాణ నిమిత్తోఽప్యపవాదఉప సంజాతనిమిత్తమప్యుత్సర్గం బాధకేతిన్యాయము** — ఇది వ్యాకరణ న్యాయము అపవాదులను చెప్పుకారణములు ప్రధానమై ఇకవెనుకే యున్నవియైయుండుటచే సాధారణ ధర్మముల నతిక్రమింపఁగలవు ఇందువలన "దేవదత్త హంతృహత న్యాయము" అనఁగా దేవదత్తుని చంపినవాఁడు చచ్చెను. అనుతరి నని భావము.

**ఉపస్మృతులు** — ఇవి వేదాంగముల లోనివి (వేదములు చూడుఁడు) ౧ కణ్వస్మృతి, ౨ కపిలస్మృతి, 3 లోహితస్మృతి, ౪ దేవలస్మృతి, ౫ కాత్యాయనస్మృతి, ౬ లోకాక్షిస్మృతి, ౭ బుధస్మృతి, ౮ శాతాతపస్మృతి, ౯ అత్రిస్మృతి, ౧౦ ప్రచేతస్మృతి, ౧౧ దక్షస్మృతి, ౧౨ విష్ణుస్మృతి, ౧3 వృద్ధవిష్ణుస్మృతి, ౧౪ వృద్ధమనుస్మృతి, ౧౫ ధౌమ్యస్మృతి, ౧౬ నారదస్మృతి, ౧౭ పౌలస్త్యస్మృతి, ౧౮ ఉత్తరాంగిరస్మృతి

**ఉపహాలక** — కుంతలదేశముచూడుఁడు

**ఉప్పరులు** — వీరింగూర్చి తెలుపుగ్రంథములు లేవు వీరియం దనుస్రుతమున వాడుకగనున్న కథనముమేరకు సూర్యవంశపు రాజగు సగరచక్రవర్తికి రెండవభార్యవలనఁ గల్గి, కపిలమహర్షి శాపమున భస్మీభూతులైన అరువదియారువేలమంది పుత్రుల సంతతివారమని వీరనెదరు వీరి పూర్వులగు సగరపుత్రు లరువదియారువేలమందియుఁ బాతాళలోకముదనుకఁ ద్రవ్వినది సముద్రమై సాగరమనుపేరం బరగుచున్నదనెదరు.

**ఉప్పికూరచెట్టు** — లా. Anona reticulata లేక Monetia barlerioides సం. గ్రీష్మజా, లవణా. నల్లఉప్పి, తెల్లఉప్పి అని ఉప్పి ద్వివిధము. లేత ఉప్పికూర త్రిదోషములను హరించి కండ్లకుఁ జలువనిచ్చును. రెంటి గుణము లించుమించు సమానములే. మఱియు తెల్లఉప్పి వేరుగాని, ఆకుగాని, రసకషాయములు గాని ఉష్ణముజేసి వాతము హరించుననియు, సూతికావాతము నడంచుననియు, ఉబ్బుజాడ్యము, ఉబ్బసము, దగ్గు, వాతకాసరోగము, క్షయరోగము నివారించుననియుం జెప్పఁబడినది.

**ఉప్పు అధికము తినువాఁడే నీరెక్కువత్రాగువాఁడు**—ఆంధ్రలోకోక్తి

**ఉప్పుతోఁగలసినమంచుగడ్డ అతిశీతల మగుట** — లవణమునకు నీటి నాకర్షించి తానందు కరగి కలసిపోవు ప్రకృతి గుణముకలదు కాన, గాలితగిలిన యుప్పు గాలినుండి నీటినాకర్షించుకొని చెమ్మగిలుం గాని యారి పొడిగా నుండఁజాలదు. వేడిగల యెండ దూదిడిన పరిస్థితులు వేఱుగా పొడిగానుండెడిని.

ఉదకమునకు మూఁడురూపములు కలవు. ఘనీభవించిన (Solid) రూపము మంచు ద్రవించిన (Liquid) రూపము ఉదకము వాయు (Gas) రూపము గాలియందుండు నీటియావిరి మొదలగునవి. ఈమూఁడును ఉదకరూపములే. ద్రవరూపముననున్న యుదకముతోఁగాని, గాలియందు వాయురూపమున నున్న యుదకమగు నావిరితోఁగాని ఉప్పుకలియుటతోఁడాగరగి దానిజేరువో దానింగూడ తనరూపమునకుఁదెచ్చుకొనునటుల మంచుతో గలియుతరి కానపుడు కరగి, దానింగరగించును. కరగుటకు కొంత శక్తి (Energy) కావలయును. ఆశక్తియే వేడిమై యుండును. అది చుట్టుపట్లనుండు Atmosphere నుండి వేడిరూపమున రావలయును. మంచు అట నుండుకతన చుట్టుపట్ల వాతావరణమున వేడియుండనేరదు. కాన ఉప్పునందున్న యీమాత్రపు వెచ్చఁదనమునే యుపయోగపఱచుకొనుచుఁ గరగిపోవును. ఇట్లనుట వలన తనయందలి వెచ్చదనము గోల్పోయి మంచువలె తానును శీతల మగు నిభావము ఉప్పుతోఁగలసిన మంచు, ఉప్పుతోఁగలియని మంచుకన్న నెక్కుడు శీతలమై యుండును. ఈ సంగతి థర్మామీటరు నుండి తెలియనగును.

**ఉప్పుపైపన్ను చరిత్ర**—భరతదేశమునం దాదికాలమునుండియు నీపన్ను విధింపఁబడుచుండినట్లుఁ దెలియఁగలదు. శ్రీకృష్ణుని జన్మమునకుఁ బూర్వము సాళ్వభూపతి వైష్ణవమను నొక క్రతువాచరింపఁదలంచి వ్యయమునకై తరాజ్యమగు మార్తికావతమున లవణకరమును కొమ్మని యుత్తరువిచ్చెననియు, ప్రజలాయన వైరియగు వసుదేవునిచేఁ బ్రోత్సహింపఁబడి పన్ను నిరాకరించిరనియుఁ జెప్పఁబడినది. మార్తికావతమున కాపురముదిరిన యాదవు లిట్లుచేసిరని యూహింపనగును. పిదప మఱి కొంతకాలము గడచినపైని శ్రీకృష్ణుఁడు సాళ్వుని సోదరుఁడగు శిశుపాలుని నిహతుంజేయుటయు గూడ సంభవించెను. ఇందువలన ప్రాతపగలు నూతనములుగ బలపడియుండనొప్పు. పిదప మఱియొకతరి సాళ్వభూనాథుఁడు ఆ వైష్ణవక్రతువాచరింపఁదలఁచితిరుగ నాయుప్పుపన్ను దాదీసికొన మొదలిడెనట. దానినాఁగిన శ్రీకృష్ణుఁడును యాదవుల నాపన్నుఁజెల్లింపనక్కరలేదని ప్రోత్సహించి క్రతువునకైన ప్రయత్నములు యుద్ధప్రయత్నములుగ మారునట్లుఁజేసెనట. ఈకారణమునసే వైష్ణవక్రతువునాపి మార్తికావత నృపాలుఁడగు సాళ్వుఁడు ద్వారకపైఁ దొమ్మిదిసారులు

దండయాత్రలోనర్పి కొట్టడించుచు శుదకా సంగరముననే శ్రీకృష్ణునిచే నిహతుండాయెనని చెప్పంబడినది. భారతదేశార్థిక చరిత్రలో ఉప్పుపైవిధించిన ఎక్సైజుపన్ను విషయము మొదటినుండియు వింతగనున్నది. ఉప్పు నుండి ఆదాయము బ్రిటిషు పాలనయందే కాక తత్పూర్వముకూడ ప్రభుత్వమునకు వచ్చెడిది. భారతదేశమునకు ఉప్పు తయారు చేయుటకు నాలుగు ముఖ్యసాధనములు కలవు. పంజాబులో నున్న కోహాటుగనులలో గల రాతిఉప్పు నుండియు, రాజపుత్రస్థానమునున్న సాంబరు సరస్సులోని ఉప్పునీటినుండియు, కచ్చిదేశములో నున్న ఉప్పునీటినుండియు, బొంబాయి మద్రాసు రాష్ట్రములలో సముద్రతీరమున సముద్రోదకమును సూర్యాగ్నిచే కాచి మరియు నుప్పును తయారుచేయుదురు. భారతదేశమున సుత్పత్తి యగుచున్న ఉప్పులో సగము ప్రభుత్వశాఖల వలనను, తక్కిన సగము ప్రభుత్వముచే లైసెన్సు లొసంగబడిన సంస్థలచేతను తయారుచేయబడు చున్నది. బ్రిటిషుపాలనము వచ్చినప్పటినుండియు ననేక సమయముల ననేకవిధముల నుప్పుపై విధించిన పన్ను మొత్తము మార్చబడినట్లు లీక్రింది పట్టికవలన దెలియనగును.

౧౮౮౮ ౧౯౧౩ వ వత్సరములలో ౮౨ పౌనులు బరువుగలిగిన మణుగు ఉప్పుపై పన్ను రు ౨౮౦ ఉండెడిది. అది ౧౯౦౩ సంలో ౨-౦-౦, ౧౯౦౫ సం॥లో ౧-౮-౦, ౧౯౦౭ సం॥లో ౧-౦-౦, ౧౯౧౧ సం॥లో ౧-౪-౦, ౧౯౨౩ సం॥లో ౨-౮-౦, ౧౯౨౪ సం॥లో ౧-౪-౦, ౧౯౩౧ (సెప్టెంబరు) లో ౧-౯-౦ ఈవిధమున ఉప్పుపన్ను మాటిమాటికి మారినది. నిత్యమును నిఖిలప్రజల కత్యవసరమగు నీఉప్పుపై పన్ను చాల తక్కువగానుండుట సమంజసమని తోచకపోదు.

**ఉపాంగములు** — భరత (నాట్య) శాస్త్రమున ౧ నేత్రములు, ౨. కనుబొమలు, ౩ నాసికము, ౪ అధరము, ౫. చెక్కిళ్లు, ౬ గడ్డము, ఉపాంగములని చెప్పంబడినవి (హస్తాభినయము, భరతశాస్త్రము, షడంగములు, ప్రత్యంగములు చూడుడు)

**ఉపాంగరాగములు** — మేళకర్తా రాగములు సంపూర్ణములనియు, వానినుండి జనించినవి జన్యరాగములనియు నందురు. సంగీత శాస్త్రమున మేళకర్తారాగములు, జన్యరాగములుగూర్చి వ్రాయబడినవి (చూడుడు) ఉపాంగ రాగముల జనకరాగములనియు నందురు. జన్య రాగములు ౧ ఉపాంగరాగములు, ౨ భాషాంగరాగములు అని ద్వివిధము. ఉపాంగ రాగములు తా నేమేళకర్తారాగమునుండి జనించిన జన్యరాగమో ఆ మేళకర్తారాగమందలి స్వరములలోని స్వరములనే గ్రహియించును గాని, అన్యస్వరములను గల్గియుండని రాగములు, సంగీతశాస్త్రము నుపాంగరాగములనబడును (భాషాంగరాగములు చూడుడు) ఇట్లనే ధీరశంకరాభరణజన్యమగు ఆరభి జన్యరాగము నందు ధీరశంకరాభరణ స్వరముల కన్యస్వరములు గానరావు. మరియు హనుమతోడి, జన్యమగు ధన్యాసిజన్యరాగము, అందు హనుమ తోడిస్వరములకు అన్యస్వరములు గానరావు. కాన నీ జన్యరాగములు రెండును ఉపాంగరాగములని యెఱుంగునది.

**ఉపాయగోత్రము** — జమదగ్నివత్స ఉపగణము చూడుడు.

**ఉపాయములు** — రాజనీతి, లోక నీతి యందును దుపాయములు నాల్గువిధములు. ౧ సామము- మైత్రివలన నితరులను స్వాధీనుల జేసికొని కార్యములుజరపుకొనుట, ౨ దానము-

**ఉపేక్ష్యయానము** — రాజనీతియందు చెప్పబడిన పంచయానములలో నొకటి మార్గ ణములు లేక వస్తువైశ్వర్యములు చూడుడు

**ఉబ్బసము** — (Asthma) ఇది శ్వాస రోగములలో నొకటి ఇది యనేకరోగములు భేదము లుగ నేర్పడును

**ఉబెర్రిమేయి** — వాణిజ్యసంబంధ పర భాషాపదము Uberrimae ఒక కంట్రాక్టు పట్టీలోగల యన్యోన్యమగు తలంపు అట్టి అన్యోన్య మ్మకము నకు Uberrimae Fedei అనిపేరు

**ఉభయత్పాశారజ్జున్యాయము** — రెండువైపులను కట్టబడి తాడని యర్థము ఇటునటు కదలలేని స్థితిందెల్పుట కీన్యాయము వర్తించును

**ఉభయభ్రష్టు ఉపరిసన్యాసి** — అన్నివిధములం జెడిపోయెనని భావము ఆంధ్ర లోకోక్తి

**ఉభయవక్రరాగములు**— వక్రరా ములు చూడుము

**ఉభయవేదాంతములు** — ఇవి సంస్కృత భాషలోని వేదములును, ద్రవిడభాష లోని వేదాంతములును కలసి ఉభయవేదాంతము లనియెదరు ఋగ్యజుస్సామా థర్వణములను సంస్కృత వేదములకు వలెనె ద్రవిడవేదములను కూడ పాటించు శ్రీరామానుజీయ మతస్థుల నుభయవేదాంత ప్రవర్తకులనియెదరు

**ఉభయశక్తిమూల** లక్షణమూడుడు.

**ఉభయాభావే విశిష్టాభావః**—విశే షము, విశిష్టము కూడ లేకపోతే కలయిక యను నది యుండదు రెండును లేకపోయినచో గల యిక యుండదని భావము

**ఉమరావతి పట్టణము (అమరా వతి)** వర్తమాన మిప్పటి బీరారు దేశమున నమ రావతియనుపురము కలదు ఇది మహారాష్ట్ర సీమగా జెప్పవొప్పును దీని నిజమైనపేరు ఉమ రావతియనియు మహారాష్ట్రులట్లె వాడుచుందురు ఆంగ్లమున వాయుటచే నమరావతియని యొకచో తప్పువ్రాయుటయు పేరు తప్పురూపమున చాల దఱ్ఱాగానుండుటయు, అన్నిటికన్న ప్రధానముగ ప్రభుత్వపు గాగితములందట్లు తప్పురూపమున వ్రాయుబడుటయు నేటికి వాంగ్లమున నాపేరట్లే నిలచినదంకరు గుంటూరుమండలమున కృష్ణా తీరమునందొక అమరావతి కలదు అది ధాన్య కటకము (అమరావతి స్తూపము చూడుడు)

**ఉమాంది గోత్రము** — హారిత ఉప గణము చూడుడు

**ఉమామహేశ్వరవ్రత పౌర్ణమి** — భాద్రపదశుద్ధ పౌర్ణమి, వ్రతదినము (వ్రతములు చూడుడు)

**ఉమావనము** — ఇది బాణాసురుని రాజధాని బదరీకేదారపాదమందున్న ఉమామహ హా శారణ్యము (శోణితపురము చూడుడు)

**ఉమ్మడిగొడ్డెపుచ్చి చచ్చినట్లు** — సంరక్షించువారులేక నని భావము ఆంధ్ర లోకోక్తి

**ఉమ్మెత్త (ఉమ్మత్త) చెట్టు** — ఉమ్మెత్తలు తెల్లఉమ్మెత్తఅనియు, నల్ల ఉమ్మెత్త యనియు, పచ్చ ఉమ్మెత్తయనియు త్రివిధములు ఇందు తెల్లఉమ్మెత్త గుణముకన్న, పచ్చ ఉమ్మె త్తయు నాటికన్న నల్లఉమ్మెత్తయు బలముగ్గ బనిచేయునని చెప్పబడినది మఱియు నిండు నల్లఉమ్మెత్త పూలు శివార్చనకు యోగ్యము లందురు ౧ తెల్లఉమ్మెత్త,లా Daturalba

**ఉరగ (సర్ప) శాస్త్రము** — ఉరగములు నోట విషమున్న జంతువులు. పాములంబిండి గరళము తీసి వైద్యులు మందులయందు ప్రయోగించుచుందురు. సర్ప విష వైద్యము ఆయుర్వేదమున వివరింపబడినది. ఈ యురగశాస్త్రమున పాదములంగూర్చిన ఇతరస గతులు వివరింపబడినవి. ఈశాస్త్రము ఋషిప్రోక్తమే. తన కుడివైపు సర్పమగుపడినను, ఆసర్పము చుట్టుకొనియున్నను, తల నెత్తిచూచినను, పచ్చని చెట్టుపై నెక్కినను మేలు కలుగుననియు, ప్రయాణ మగుతరి పామును జూచియన్యుండెవ్వరేని పాము పాము అనియరచినను, ఆ పాముపడగ విప్పియుండగ తాజూచినను, ప్రయాణము సౌఖ్యముగ జరుగుననియు, ఆపాము తనవైపు చూచెనేని మార్గగమనము కష్టముగ నుండుననియు తాకొక యూరంగాని యింటంగాని ప్రవేశించుతరి పాము కూత వినుట శ్రేయోదాయకమనియు, తా నింటినుండిగాని ఊరునుండిగాని ఒయలు వెడలి బయటికేగుతరి పాముకూత వినుట యమంగళప్రదమనియు నా పయనము మానుట శ్రేయమనియు చెప్పబడినది. ఇంకను కొందఱు సర్పశాస్త్రవేత్తలు ప్రవేశించుతరి పాముకూత కుడివైపున శుభమనియు, ఎడమవైపున నశుభమనియుం జెప్పిరి. ఒక పాము వేరొక పామును మ్రింగుట చూచుట యమంగళకరమనియు, పాము ప్రవేశించుట జూచుట శుభప్రదము కాదనియు, పాము బైటికి వెడలుచుండుట గూడ జూచుటయుల్లె యశ్రేయస్కరమనియుం గూడ మతాంతరమున కలదు.

రెండుపాముల కలహము జూచిన అగ్నిభూతములు విననగుననియు, పాము పారిపోవుచుండగా జూచుట నష్టకరమనియు, చచ్చినపామును జూచుట మృతవార్తాశ్రవణమనియు, ఆడుపాము మొగపాము కలయికం జూచుట శుభము చేకూరుటకు ముందు జరుగు పనియనియు, అది శుభసూచకమనియు పెక్కండ్రు ఋషులు వచించిరి. ఒక చెట్టునుండి పాము దిగుటను భూపతులు చూచిన వారికిం బ్రబలమగు నష్టము సంప్రాప్తమగుననియుం జెట్టెక్కుతరి చూచుట శ్రేయోదాయకమనియుం జెప్పంబడినది. ఇది సంసారులకుంగూడ కొద్దిగనో, గొప్పగనో ఫలమిచ్చునని మతాంతరము గలదు. ఇంకను కొందఱు ఋషులు, పాము ఇంటిలోనికి జొరబడుట గాంచిన ధనపతిదరిద్రుండగుననియు దరిద్రుండు ధనపతి యగుననియుం జెప్పిరి. ఇంకను పుట్టపైకి పామెక్కుచుండుట చూచుట కీర్తిఫలమే చెప్పబడినది.

తన కెడమవైపు పామును జూచి నడచినయెడల తనేగు కార్యము చెడుననియు, పామరచుచు పోయినచో తనేగు కార్యము పాడగుననియు, పాము పొరలుచుండ దాని కడుపు కనపడిన కార్యనాశనమనియు, ప్రయాణములం దివి ధమగునేని సు తోకతో వెనుకకు మఱలుటయె శ్రేయమనియు నురగశాస్త్రవిశారదులగు ఋషులు వచించియున్నారు. మార్గమేగునపుడు దారిలోం బాము కనంబడి బెదరి పారిపోక నిలచియుండిన సకల శుభములు కల్గుననియు, కుడివైపునుండి సర్పము వచ్చిన తాందలంచిన తలంపులు నెరవేఱుననియు, పడగ నాడించిన సంపత్కరమనియు, తను చూచి పాము పడగ విప్పి ఆడిన ధనజీవనము, శుభము, ధనలాభము తప్పక కల్గుననియు ఋషులు నుడివియున్నారు.

యజమాని చేనువద్దకుంగాని, తోటవద్దకుంగాని యేగుతరి నట పాము పడగ విప్పి యాడునేని, అఫలితము మిక్కుటమై యుండుననియు, అదివఱకే అట నాడుచుండిన పాము తానట కేగగనె తన్నుం జూచి పారిపోయినచో, అపంట తాం దినుటకు ప్రాప్తముండదనియు, పాము పడగ విప్పి యాడినఫలమున పంట పండదనుకొనిన

యను సుఖరోగమున పైనవేసి కట్టిన నివారణ మగునని యుం చెప్పుదురు

**ఉరుకు ఉరుకు మనేవారేగాని ఉరికేవారుండరు**—పనిచేయుటకన్న కబుర్లు చెప్పుట తేలికయని భావము (ఆంధ్రలోకోక్తి)

**ఉరుగ్వే దేశము** (Urugway Republic) — దక్షిణ అమెరికా ఖండమున లాప్లాటా దేశభాగమగు ప్రజాపరిపాలన దేశము ఇది దక్షిణముగా నున్నది ౭౨౦౦౦ చతురపు మైళ్ళ వైశాల్యము గలది (లాప్లాటా దేశము చూడుడు దక్షిణ అమెరికా చూడుము) మోంటివిడో ప్రభుత్వ కార్యస్థానము ముఖ్య పురము ఇది లాప్లాటా నదీతీరమున వర్తకస్థలము

**ఉఱుము మెఱుపులకు ముందు గాలి వేడియగుట** — భూమిమీద ఎట్టి గాలి యున్నదనియు, ఎంత వెక్కుపొరలుగ నున్నదనియు నెల్లరెఱింగినదే భూమి సమీపము మీదు క్రింది వరుసలు వేడిగను, ఆకాశము వైపు పైకివెళ్ళినకొలది చల్లగ నీపొరలుండును వేడి గాలి తేలికయగుట నాకాశముపైకి దేగుచుండుటయు, ప్రక్కలనుండియు పైనుండియుం జల్లనిగాలివచ్చి యెగిరి తేలిపోయిన గాలియుండిన స్థానము లాక్రమించుటయు(వాయుచలనము) నెప్పుడు జరగుచునే యుండును చల్లని గాలి భూసమీపమునకు జరిగి సకాలమున వేడియై అదియును అట్లే పైకితేలిపోవుచుండ చల్లని గాలి తిరుగ చేరుచుండును ఇది వాయుచలన విధానము మేఘములు దట్టమై మెఱుపుల ఉఱుముల తరుణమున విద్యుత్ప్రభావము ఆకాశమునను బలి వ్యాపించి గాలిని విద్యుచ్ఛక్తిమయ మొనర్చును ఈమార్పునంతకు భూమినుండి పైకేగుచుండిన వేడిగాలి చోరలేక నిలచిపోవును భూమిపైకి మామూలుమేరకు చల్లనిగాలి ప్రవేశించుటకు వీలుకాకుండును దానివిమనము వేడిగానున్నదని పల్కుదుము ఉక్కగా నున్నదనియు, గాలి లేదనియు (Close) తలంతుము

**ఉఱుము** — వర్షాకాలమందెంచ నాకసమున మేఘములు దట్టమై క్రాడియుండుతరి విద్యుత్తు (Electricity) బలపడి మేఘముల గుండా పరుగిడనారంభించును ఒక మేఘము నుండి ఇంకొక మేఘమునకుం బర్వెడుతరి సమతలముగను డింకక్కగ నడవముగాని, ఒక మేఘమును డి జరిగి ఎల్లముగనున్న వేరొక మేఘముపైం బడుతరిగాని కేవలము క్రిందికిజారి (భూమియొక్క ఆకర్షణశక్తికిలోనై) భూమిపై బడుతరిగాని గాలిపైంబడుతరి నావిద్యుత్తును (శక్తిని) గాలి యుంచుకొనలేక నిల్వంజాలక పోవును అట్టి విద్యుద్వాయుప్రవాహము రేకెత్తించిన ప్రతిరోధము వేడినుద్భవింపం జేయును వేడివలన నచటిగాలి వికసించి విస్తరించుటతో నస్వాభావికమగు చలన నిరోధములుగల్గి పెదధ్వనియగును ఆ ధ్వని తరంగములు మహానాదముగుండా మనకు వినబడుటకు స్వల్పమైన కొంతకాలము పట్టును దానిని ఉఱుముననుచున్నాము విద్యుత్తు మనకగుపడుట కతిస్వల్పకాలమే చాలుగాన ముందుగ గుపడుచుండును ఆ యగుపడుదానిని మెఱపనుచున్నాము మెఱయుటయు ప్రకాశించుటయని యర్థము ముందు మెఱుపుకన్పించి పిదప ఉఱుమువినిపించుట సహజము ఉఱుముటయు మెఱయుటయు నొకేతరి గల్గినను మన కడకు చేరుటకు ఉఱుమున కించుక యాలస్యమగుటకు వేఱుకారణము లేదు కొందఱు వానవాటున తలంచునట్లుల మేఘము లొండొంటితో రాసికొనుటవలన నంతమాత్రమున కాదు జలమగు విద్యుత్తు భూమిపైంబడుతరి కొంతవఱకు నాశనమొనర్చుచు దానికతిసమీపమునందుండిన ప్రాణులు మృతినొందుటయు, వృక్ష

ములపైఁబడిన నవి చచ్చుటయు సంభవించును అత్తరి దానిని పిసుగంపురు కొందరజ్ఞతచే పిసుగును ఇంద్రుని రథపుశీలయో, మేఘో యని తలంచిరి గ్రోలిలోని రోమములు జ్యూపిటరను దేవత పిడుగు, ఉఱుము, మెఱపుల కధినాథుడని

**ఉరుశ్రవుఁడు** — నరిష్యంతుని వంశస్థుఁడు తండ్రి పేరు సత్యశ్రవుఁడు సత్యశ్రవర్షి ఋగ్వేదాధ్యాపకుఁడని తెలియుచున్నది మఱియు నరిష్యంతుని సంతతియందే వీతిహోత్రుఁడను వాని పుత్రునకును ఉరుశ్రవుఁడని పేరు కలదు

**ఉరూధ గోత్రము** — భరద్వాజఉప గణము చూడుఁడు

**ఉర్మియానరస్సు** — పారశీకదేశము చూడుఁడు

**ఉర్ పట్టణమునందలి చంద్రుని దేవస్థానము** — ఉర్ పట్టణము ఛాల్డియా దేశములో నుండిన పురము (ఛాల్డియనులు, ఛాల్డియాదేశము, ఛాల్డియారాజ్యము చూడుఁడు) ఇచట చంద్రున కర్పింపఁబడిన దేవాలయము కలదు దానినిప్పుడచటివారు జిగాత్ అను చున్నారు అది క్రీస్తు కునుపు మూడువేల సంవత్సరములనాటి పనిగ పరిశీలకులు గోల్చిరి ఇబ్రాహు నొకతరి దేవుని స్నేహితుఁడైన అబ్రహాముప్రవక్త దర్శించెనని యచటివారనెదరు ఈపరిసరములఁ ద్రవ్వంబడిన తావులందు బయల్పడిన గోరీలలో మానవశరీరచిహ్నములే గాక, నిత్యకృత్యముల కవసరమగునవియు, తెలియనివియు నగు ననేకవస్తువులుకూడ దొరకియున్నవి వీరిమతమేమో అప్పటివారికి పునర్జన్మములందు నమ్మక ముండెనో లేదో, చంద్రు నేల వీరు పూజించిరో పరిశీలన జరుగఁదగినది అబ్రహాము దేవుని చెలికాడని బైబిలునందు చెప్పంబడినది ఈతావు మెసపొటేమియాదేశమున ఇరాక్రాయిత్వే నంటి యున్నది

**ఉలవలు (ఉలవ) చెట్టు** — లా Dolichos unichos లేక, Dolichos biflorus, ఆంగ్ల Horse gram సం కులత్థిక తామ్రబీజ అరవమున కొళ్లు

సర్వసాధారణముగ నల్లఉలవలను ఉలవలని వాడుదురు ఇవిగాక ఎఱ్ఱఉలవలు, నల్లఉలవలు, అడవిఉలవలు అని మూఁడుభేదములునుకలవు ఉలవలు సామాన్యముగ నొకవిధమగు గుణమే కల్గియుండు నగాని, నల్లఉలవలు ఎక్కువబలముగ పనిచేయు నియు, అడవి ఉలవలకు వేఱుగుణములు కలవనియు గనిపెట్టఁబడినది ఉలవలను కషాయముగ నొనర్చియు, చూర్ణము (పిండి) గ జేసియు, ఉలవపప్పు, ఉలవకట్టు, ఉలవగంజి మొదలగు రూపములుగ నొనర్చియు వాడియు వైద్యులు వాడుచుందురు వెగట నూడి వేడి చేయును ఇది పైత్యముగూడ చేయును శరీరము స్థూలమగుట నివారించును వీర్య నష్టము కల్గించును రాతిని బద్దలు చేయు శక్తిగలదు

ఉలవలయందీక్రిందిగుణములు కలవని చెప్పఁబడినది అనగా నీరోగములను హరించునని భావము ఉదరరోగములు ఉపరిగొట్టునొప్పి, ఎక్కిళ్లు కఫరోగములు, కుసుము, గుదరోగములు, గుల్మరోగము, తూని, పతూని, అను రోగము మొదలగు సర్వవాతములు, నేత్ర రోగములు, పీనస, స్త్రీల బహిష్ఠరక్తస్రవదోషములు, మధుమేహము, మలబద్ధము, మూత్రకృచ్ఛము, మూత్రబద్ధము మొదలగు మూత్రరోగములు, మూలవ్యాధి, రాజయక్ష్మ, శ్వాసకాసలు, శూలలు నివారించును

అడవి ఉలవలకు లాటిన్ భాషయందు Dolichos uniflorus అనియు, ఆంగ్లమున Wild horse gram అనియు సర్వసాధారణముగ కలకోటిగింజ లని వాడుకపేరును కలదు

ఇవి మలమూత్రబద్ధము నివారించి ఎక్కుడు కఫ రోగములు, పైత్యదోషము, నేత్ర రోగములు నివారించుననియు మేధస్సుందలి ముఖ్యకల రోగము నివారించుననియు గిజలగంధము కంఠ కలక, ఎముకలు పొరలు నివారించుననియు ఇంకను కంఠపొరలుగూడ నయమగుననియు చెప్పబడినది ఇది చేయు దోషములకు విరుగుడులు కలిసీళ్లు, తేనె, మాన నెయ్యి అని చెప్పబడినది

**ఉలవలవ్యవసాయము** — వర్షములు లేకున్నను మెండుగా పెరిగి పండు పంట ఇది పశు, పక్ష్యాదుల యాహారముగ నుపయోగించు పప్పుజాతి పంట ఇది కల్లు నేలలందు, గరప భూములందు కూడ ఫలించు తేలిక పంట దీనిని పూతయిదనున భూమిలోనికి దున్నినచిన భూమి సారవంతమగునని అనుభవజ్ఞులగు రైతులనుచుందురు ఎకరమునకు ఇరువది ఏను విత్తులంజల్లుదురు ఇది మూడు లేక నాల్గు నెలలకు పండి కోతకువచ్చును ఎకరమునకు మూడటన్ను పంటపండునని చెప్పబడినది ఉలవలు భూమిని ఎక్కువగ ముదలనాపి మాగన్నుతు చేయనక్కర లేదందురు ఉలవచెట్టు సాగముగ పశువుల యాహారమగుచు ఉలవల నుడకబెట్టక నానించి పశువుల కాహారమిచ్చుట మంచికాదని పరిశీలకులనుచుందురు

**ఉల్కలు** — ఏరోలైట్సు చూడుము

**ఉల్కాపాతము**— (Shooting Star) సూర్యుడు మొదలగు నాకాశజ్యోతుల నాశ్రయించుకొని భూమివలె వానిచుట్టు తిరుగునట్టి యాసంఖ్యాకములగు భూములవంటివి, చిన్న చిన్నవి అనేకవేల కోట్లాకపముగ దిరుగుచుండు ననియు, అందు కొన్ని కొన్నిటన్నుల బరువుండ నోపుననియు, తక్కినవి పెక్కులు కొన్ని గ్రాముల బరువుగానియు ఖగోళ శాస్త్ర వేత్తలు కనిపెట్టిరి బరువుతక్కువయగుట యాకర్షణ విధియందు స్థిరతము జాలక ఒకొకటి రాపిడిచుకొని దిరుగుచుండిన చలించు మందు కతం నేదేని యితర గ్రహముల ఆకర్షణ లోనికి జేరనేని దారితప్పి దానిపై కేగుచు పటిముగోల్పోయి బరుగున బరుట వేగమున మహావాయు మండలియందలి ప్రాణ వాయువు (ఆక్సిజెన్) ఉదజని (హైడ్రోజన్) మొదలగు గాలులున జ్వలింప మండుచు బూడిద యగుచు నాయాకర్షించు గ్రహముపై బడును అట్లే భూమిపైగూడ పడుట మనమప్పుడప్పుడు జూతుము దానికి ఉల్కాపాతమని (Shooting Star) పేరు నక్షత్రము రాలినదని యందురు కాలి బూడిదకాకుండ మిగిలిపోయి భూమిపై బడినముక్కకు మీటియొరైట్ (Meteorite) అని పేరిడి యున్నారు ఉల్కలను ఏరోలైట్సు (Aerolites) అనియు నందురు జర్మను భాష నుండి యీపదము గ్రహింపబడినది Aer అన గాలికిని Lithos రాతికిని అర్థము ఇవి తరచుగ భూమిని సమీపించు కతన భూమిచుట్టియున్న వాయు మండలియందు జేరికొనుచు, కాలి భగ్నమగుచునే యుండునని ఆంగ్లపండితులు కనిపెట్టిరి

**ఉల్కాయని గోత్రము** — నిధ్రువగణము చూడుము

**ఉల్ముకుడు** — తండ్రి చక్షుర్మనువు తల్లి నడ్వలాదేవి ఈతడు కనిష్ఠపుత్రుడు భార్య పేరు పుష్కరిణి అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు అంగిరసుడు, గయుడు నను నార్గురు పుత్రులు కలరు

**ఉలూకుడు** — శకుని చూడుము

**ఉలూఖరేఖ** — పురుషసాముద్రికము చూడుము, స్త్రీసాముద్రికము చూడుము

**ఉలూతబభ్రు గోత్రము** — కుశిక గణము చూడుడు.

**ఉలూపి లేక ఉలూచి** — త్రిశ్రవాసుకి నాగకన్యక అర్జునునివలన ఇలావంతుని గనెను

**ఉల్లి** — ఉల్లి నీరుల్లి యనియు, తెల్లఉల్లి యనియు, అడవిఉల్లియనియుం త్రివిధములు

౧ నీరుల్లి (నీటిఉల్లి) దీనిని సర్వసాధారణముగ ఎఱ్ఱఉల్లి యనియునందరు లా Allium cepa ఆ గ్ల Onion సం పలాండు, ముఖదూషణ, సుకంద యని పేర్లుకలవు ఇది సర్వసాధారణముగ నెత్తురురంగు (Scarlet) గ నుండుగాన నెత్తురుల్లి యనబడునుగాని దీనియందు కేవలము తెల్లరంగుగల ఉల్లిపాయలు ఒకజాతియు, పసుపుపచ్చరంగుగల ఉల్లిపాయలజాతి యొకటియు కూడ గలవు ఇంకను, ఆంధ్రదేశమునం దెఱుగనగు చిన్నజాతి ఎఱ్ఱఉల్లియు, విదేశములనుండి తెప్పించి సారవంతమగు భూములలో మంచిపరిస్థితులందు పెంచబడిన పెద్దజాతి ఎఱ్ఱ (లేక నీరుల్లియు) వుల్లియు స్పష్టముగ రెండు భేదజాతులుగ గాన్పించును ఇట్టి పెద్దజాతివగు నీరుల్లిపాయల యందు గనను ఎఱ్ఱని రంగుగలవియు, తెల్లనిరంగు గలవియు, పచ్చనిరంగు గలవియు మూడుగ భేద జాతులును కలవు నీరుల్లి చిన్నమొక్కగ తన యాకులనడుమనుండి యొక గొట్టమువంటి కాడ పొడుగుగనిలచి దానితలను గుత్తివలెబూచి కాచినచిన్నగింజలను నాటుటవలనను, మఱియొకటి సన్నపు చిన్నచిన్న ఉల్లిపాయలం బాతి మొలపించుటవలనను పైరుచేయబడునది దీనిని భోజనపదార్థముగ పెక్కండ్రు వాడుచున్నారు దీనియందౌషధోపయోగము గూడ కలదు మఱియు నీరుల్లి కొన్ని దుర్గుణములు గూడ గల్గించునని చెప్పబడినది.

నీరుల్లిపాయలరసము పైత్యశాంతియు, మేహశాంతియు గల్గించునియు, మూత్రములోని సుద్దను హరించుననియు రక్తనాళములం బరిశీలించుననియు ఇంద్రియములకు చురుకుదనముం బుట్టించుననియు ఒకటికిపూసినచో ఓకవాదద్రోగము (Scurvy) నివారణముగ నియు పురుగులు కుట్టినచోట రుద్దుమట శమించు ననియు, ముకుపోటి డిన మూర్ఛను డి తెలివి వచ్చుననియు, వడకొట్టి వానికి శరీరముగరాచిన శాంతికల్గునియు ఇదిచికి కాపడమిడిం కేడీకటి, కండ్లకలక, ముక్కులోనిడిన నాసరోగములు తగ్గుననియుం జెప్పబడి ది మఱియు నజీర్తి, కఫుబ్బు, కర్ణరోగము గర్భవాతములు గ్రహణులు జ్వరములు మూలశంఖరోగము రక్తమూత్ర, రక్తాతిసారములు, శ్లేష్మరోగముల నడచునునియుం జెప్పబడనది

నీరుల్లిపాయ విరేచనము వెడలించి, దహపుట్టియు, వీర్యపుష్టియు గల్గించెడిని కుట్టించోట రుదించో పాము, తేలు, జెఱ్ఱ లాటుల విషములే గాక పెఱ్ఱికుక్క విషముగూడ శమించుననుసిరు. ఉలివి త్తగములు నూరినముద్ద కండ్లకిడిన కనురెప్పలందలి పాండిము నివర్తించును ఉల్లిపాయల రసము దంతరోగములనాపును తిమ్మెరపైరుద్దిన శమింపజేయును మఱియు నీరుల్లి యందు బుద్ధిమాంద్యము, అధికముగదినిన అజీర్తి, పరాకు, పార్శ్వపునొప్పి, శరీరమున క్రిములుకల్గించు దర్గుణములు కలవని చెప్పబడినది నీరుల్లియందలి దోషములకు ఉప్పు (నీళ్ల) తో గడుగుటయు, పులుసులో నుడుకుట, నేతిలో వేయించుట పరిహారములని చెప్పబడినది

౨ వెల్లుల్లి లా. Allium sativum ఆ గ్ల. Garlic సం మహౌషధ, రసోనా, లశున, వెల్లుల్లిని తెల్లఉల్లి యని యందరు మిగుల వేడిచేయును విరేచనము గావించును. శరీర

ప్రకృతిని మార్చును సర్వవాతములను హరించును. అన్ని వాతనొప్పుల నివారించును దేహమును పచ్చగా గారజేయు జ్వరమును హరించును వీర్యము తగ్గించును స్త్రీలకు ఋతురక్తమును సుభ్రపఱచును కాలు సేతులు వణకు రోగము నివారించును మూత్రపుసంచిలో జనించు శిలలను హరించును సర్పవృశ్చిక విషయములనే గాక పిచ్చికుక్కల విషము విరుచునని చెప్పబడిన మఱియు వెల్లుల్లి తరుచు తినుమాను వారికి ఆలవాంకలు నెరయక నల్లబడునని యాదుకు వెల్లుల్లి నూరి కట్టుటవలన గోరుచుట్టు, కణుపుశ్వాస, మశమశూలంబు, గడ్డలు, కంతులు కూడ నివారింపబడునని చెప్పబడినది ఇంకను సర్పవిషము పాకిచుట్టు కూడదిది మఱి వఱటిదనియు, పాము కరచిన కోట్ల కోసి రుద్ది చిన విషము బీట్టనియు చెప్పబడుచున్న గుదస్థానమునందలి దద్దు దీనిరసముచే నివారణ మగునట బహుమూత్రరోగము కూడ శాంతించునట. ఇంకను ఒంటి కేక వెల్లుల్లిపాయ లూగొన్ని యుండెడిని అవి పాముల జాపగలవని చెప్పబడినది పాము లా వాసనకడకు జేరక మఱలి పక్షవాతము పార్శ్వపు తలనొప్పులు నివారణ మగును అధికముగా దినిన నపుంసకత్వమును గల్గించి, తలకొప్పిగూడ బుట్టించును కాళ్లు చేతులంగ మంటలు గల్గించును రక్తప్రవాహమునకు త్వరితగతిం గలుగజేయును

వెల్లుల్లి కల్గించు దుర్గుణములకు నేయి, పాలు, పులుసు, బాదముపిక్కలలోని నూనె, దానిమ్మకాయల రసము, ఉప్పుతో నీరున ఉడికించుట పరిహారములని చెప్పబడినదట వెల్లుల్లియాకుల కూర పైత్యము, కాక జేసి కీళ్లల నడచునని యు, విరేచనబద్ధము గల్గించుననియు చెప్పదురు

3 అసవిఉల్లి గడ్డలు గరుగజేయును. నూరి తలకు రాసిన పేలు జంపును. తలకు మర్దన చేసిన మూర్ఛ, బెంగ నివారించి ధైర్యమును గల్గించును మూత్రమును వెడలించును అధికముగ వాడిన వాంతులు, వికారముల బుట్టించును మఱియు నిది గుల్మముల మూత్రబద్ధమును నివారించునది గుల్మముల జ్వరమును నివారించు నట

**ఉల్లి ఉంటే మల్లి వంటలక్క** — ఆంధ్రలోకోక్తి

**ఉల్లేజి** — వాణిజ్యసంబంధపరిభాషాపదము. Ullage- దీనికి waste అనియు, కారిపోవుటయనియు అర్థములుకలవు

**ఉవ్వచెట్టు** — లా Dillenia speciosa దీని కాయ పగురుగల్గి పుల్లగ నుండును పైత్యశ్లేష్మములను హరించి నోటికి శుభ్రపఱచును ఇంకను రుచ్యత్వముగ నుండి విరేచనబద్ధము చలువయుం జేయును ఇంకను వీర్యవృద్ధి గల్గించుననియుం జెప్పబడి ది

**ఉశంకు** — అత్రి, చంద్ర, యాదవక్షత్రియుండు తండ్రి అహి కుమారుండు చిత్రరథుండు. ఉశంకునకు భేరుశంకుండనియుం బేరు కలదు

**ఉశనస్సు** — అత్రి, చంద్ర, యాదవ, హైహయ (తాళజంఘ) వంశక్షత్రియుండు వృష్ణి కుమారుండు సుతునిపేరు కౌండివమహిమ్మంతుండు (చేదిదేశాధీశుండు)

**ఉశనుడు** — ఈతనికే శుక్రుండను (మారు) పేరవాడు "ఉశన" నామముతోం గొన్ని నామములును, శుక్రనామముతోం గొన్ని యథర్వసూక్తములుం గలవు శుక్రునకు "ఉశన" నామము నిఘంటువులందుం గలదు. శుక్రనామముతోం నొక నీతిశాస్త్రమును (శుక్రనీతి), ఉశననామముతో నొక స్మృతియు (ఔశనస్మృతియు) ప్రసిద్ధములై యున్నవి. శుక్రునకు భార్గవ నామము ప్రసిద్ధమై యుండుటయు, భార్గవపురాణ

వలయూత వ్యాపించినది కాని పాలకుల యశక్తతచే బందోబస్తుదవ కతాగ్రాంతమునకు జీర్ణదశ వందెను

**ఉహానగోత్రము** — కండిల గణము చూడుడు

**ఉక్షాయనగోత్రము**—వాధ్ర్యస్య లేక మిత్రయుపగణము చూడుడు

---

**ఊరొడికూర చెట్టు** — దీని ఆకురసము గ్రహణి, గుల్మము, విద్రధి, కఫముల నడచు ననియు, అగ్నిదీప్తి నిచ్చుననియు చెప్పబడినది వేడిచేయును

**ఊడగచెట్టు** — లా Alangium decapetalum ఆంగ్ల Sage leaved Alangium Hexapetalum సం అంకోల, దీర్ఘమూలక, నికోచక ఊడుగ ఎఱ్ఱని, తెల్లని వల్లని రంగుల పూవులుపూయును అందెఱ్ఱని పూవులుంబూయునది బలముగ పనిచేయునందురు ఊడుగవేరుచెక్క సర్వవిషముల నడచు నని చెప్పబడినది వేడిచేసి రక్తాతిసారము, కుష్ఠు, వ్రణములు, సవాయి మొదలగు చర్మరోగములు, జ్వరములు ఉబ్బురోగము, వెఱ్ఱికుక్క వెఱ్ఱి పక్క కాటు విషములు, మేహవాతపునొప్పులు, మూలవ్యాధుల నడచునని చెప్పబడినది అధిక మైన వమనముగల్గుచు దీనిని వమనముచేయింప వలసినతరి చాలతొందరగల్పి లోనికిత్తురు ఊడుగకు కరక్కాయచూర్ణము, సజ్జాహారము, తేన విరుగుడులని చెప్పబడినది

**ఊడుగవిత్తువంటివాఁడు** — అనఁగా తుదకు తన స్వస్థలమునకు లేక తన స్వంత మనుష్యులం చేరుకొనువానింగూర్చిన వాడుకలోకోక్తి (ఆంధ్రలోకోక్తి)

**ఊదకూటి బలము, ఉద్యోగ బలము అట్టేకాలము నిలుచునవి కావు** — ఆంధ్రలోకోక్తి

**ఊపిరి** (Breathing) ఉచ్ఛ్వాసరూపకమై లోనికుంబీల్చు గాలియు, నిశ్వాసరూపకమై పైకి వదలుగాలియు (కలిసి) ఊపిరియనంబడుట నెల్లరెఱిగినదే ఇది నాసికారంధ్రములనుండిగాని, నోటినుండిగాని సరాసరి ఊపిరితిత్తుల (Lungs) కడకుం జేరుచున్నదని యనుకొనరాదు నిజమున నీయూపిరిగాలి నాళముల యడుగుభాగమునకుం గూడ జీవజాలసంతతి బలహీనముగ విశ్రాంతికాలముంగ దూపిరియాడుచుండెడిని శ్రమపడి పనిపాటుచేయనప్పుడును, భోజనానంతరమున కొంచెముకాలమును అందుముఖ్యముగ శర్కర, నెయ్యి మొదలగు బలవత్పదార్థములం గల్గిన భోజనముకుంబిదపను (ఎలనన, నీటి పదార్థము త్వరితముగ దహనమై Carbon Dioxide గా మారును) మనుష్యులు బలముగను లోతుకుంజను నటుల నూపిరిదీయుట గల్గుచుండును వేడికల్గియుండు తావులను, చలిప్రదేశములను, బలముగ నుచ్ఛ్వాసము, నిశ్వాసముగల్గుట సంభవించుచుండును వృద్ధులు, బలహీనులు, బలహీనముగ నూపిరిదీయుచుందురు అదేపనిగశ్రమపడుచుండు పక్షిజాతులు, పాటంబాడుచుండువారు, ప్రసంగించుచుండువారును బలముగ నూపిరిం దీయు

చుండును ఊపిరిఁ దీయుతరి నుచ్ఛ్వాసమున లోనికింబీల్చినగాలియందలి ప్రాణవాయువు (ఆక్సిజను గాలి), లోనదహింపఁబడుచు పరిశుభ్రస్థితిం గల్గించుచు ఏర్పడిన బొగ్గుపులుసు (కార్బాండియాక్సైడు) గాలి పైకినిశ్వాసరూపమున వెడలు చుండును లోన నగు సర్దుబాటువ్యాపకమున నాంగ్లమున Diffusion అనియెదరు

**ఊపిరిగొట్టు నొప్పి (హిద్మ)** — ఆంగ్ల Stitching pain లేక Catching pain ఊపిరిఁ దీయుచు శ్వాసము విడుచుతరి గుండెలలో నెముకలనడుమను, ప్రక్కయెముకల నడుమను కల్గెడి నొప్పి ఒకప్పుడు పొట్లుపొడిచి నట్లు బాధించునది

**ఊపిరి బిగబడితే ఉదరము నిండునా ?** — ఆంధ్రలోకోక్తి

**ఊరంతా బంధువర్గమేకాని ఉట్టి కట్టుకొన తావిచ్చినవారు కారు** — ఆంధ్రలోకోక్తి

**ఊరందరిదీఒకదారి ఓర్వలేనివాని దొకదారి** — ఆంధ్రలోకోక్తి

**ఊర బిచ్చుకపై చంద్రాయుధ ప్రయోగమా?** — ఆంధ్రలోకోక్తి

**ఊర్కస గోత్రము**—కపి ఉపగణము చూడుఁడు

**ఊర్ధ్వధనుషాసనము** — యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. అరచేతులను, పాదముల అరికాళ్లను భూమి నానించి వెల్లకిల ముగ్గవైచినటుల శరీరమును వెనుకకు వంచి, నడుము పైకెత్తియుంచుట దీనివలన అపానవాయువు సరించుటయు నిద్రాలస్యము లడిలిపోవుననియు చెప్పఁబడినది.

**ఊర్ధ్వపద్మాసనము** — యోగశాస్త్రమున చెప్పఁబడిన యాసనములలో నొకటి. అర్ధపద్మాసన నాసీనుఁడై (అర్ధ పద్మాసనము చూడుఁడు), శిరస్సు భూమికానించి రెండు అరచేతులు నేలమోపి శరీరమున తయు పైకి లేవదీసియుండుట ఊర్ధ్వపద్మాసన మనంబడును. దీని నాచరించునపుడు వణకరాదు దీని యభ్యాసమున ప్రాణవాయువు అధోగతియు అపానవాయువు ఊర్ధ్వగతియుం గలదిగ నగునని చెప్పఁబడినది

**ఊర్ధ్వముఖ నక్షత్రములు** — జ్యోతిషశాస్త్రమున ౧ రోహిణి, ౨ ఆర్ద్ర, ౩ పుష్యమి, ౪ ఉత్తర, ౫ ఉత్తరాషాఢ, ౬ శ్రవణం, ౭ ధనిష్ఠ, ౮ శతభిషం, ౯ ఉత్తరాభాద్రలకు ఊర్ధ్వముఖ నక్షత్రములనిపేరు ధ్వజస్తంభ ద్వారబంధ, గజశాల అశ్వశాల, పందిరి, వాము, పట్టాభిషేక ప్రారంభములకు అర్హములని చెప్పఁబడినవి (అధోముఖ నక్షత్రములు, తిర్యఙ్ముఖ నక్షత్రములు చూడుఁడు)

**ఊర్ధ్వరేఖలు**— పురుషసాముద్రికము, చూడుఁడు స్త్రీసాముద్రికము చూడుఁడు

**ఊర్ధ్వశైవము** — ఇది చతుర్దశ శైవభేద మతములలో నొకటి (చూడుఁడు) ఈ మతమున త్రిపదార్థములు, మంత్రయము, శివసమవాగి మతమునందువలెనే యుండును పతియగు శివుఁడు తత్త్వాతీతుఁడనియు, పశువు (ప్రాణి) శివునిఁ జేరుటకు భూతి, రుద్రాక్ష, జటా, యజ్ఞోపవీతధారియై శివార్చనయు, పంచాక్షరీ స్మరణము నొనర్చుచుండవలెననియు, సన్యాసము గైకొనినను, సంసారమునందున్నను, ఒకటే యనియును, శివుని జేరుటయే ముక్తియనియు నందురు

**ఊర్ధ్వసంయుక్త పాదాసనము**— యోగశాస్త్రమున చెప్పఁబడిన యాసనములలో నొకటి తలక్రిందుగాను, కాళ్లు పైకెత్తునట్టుల

వృక్షాసనము వైచి (వృక్షాసనము చూడుఁడు) కాళ్లను గుదద్వారముకడకు మడిచి యట రెండరికాళ్లను జోడించుట. ఇయ్యాసనమువలన కుక్షి సంప్రక్షోభము గల్గునని చెప్పఁబడినది.

**ఊర్వశి** — నరనారాయణులను మునులు బదరికాశ్రమమున తపమొనర్చుతరి గంధర్వాదిదేవతావనిత లటకు విహరించుచు నేతెంచి వారి గాంచి గేలిసేయఁగడఁగి వారి తపోభంగమొనర్ప హావభావ విలాసాది చేష్టలచే తమ ప్రౌఢిమ ప్రదర్శింప, వారిర్వురు చలింపక నారాయణముని తనయూరువుపై గోటికొనగా గీఁకి యూర్వశి జనించెననియు యామె సౌందర్యమున కచ్చెరువంది యావనితలెట తమ యాటలు సాగవని విన్నఁబోయియుం గదుఁగదిలేక నాయూర్వశి వనితాదములకగ్రగణ్యగ కొనర్చుకొని జనిరనియు భాగవతమునఁ జెప్పఁబడి ది. ఒకతరి నర్జునుఁడు కాలకేయ, నివాతకవచుల నతమొందిప స్వర్గమునకుం గొనిపోవఁబడెనట. అట నాతని నూర్వశి వలచి కామించెట. నాతఁడామెను నిరాకరింప నామె నీవు నపుంసకుఁడవు గమ్మని శపించెట. అద్దానిని సురేంద్రుఁ డెరింగి పాండవాజ్ఞాతవాసకాలమున నీనపుంసకత్వ మతని కెకుటకును పిదప విముక్తి యగునట్లును సవరించెను.

**ఊర్ణాయనగోత్రము** — భరద్వాజ ఉపగణము చూడుఁడు

**ఊరిలో కుంటిడము అడవిలో పరుగెత్తడము** — ఆంధ్రలోకోక్తి

**ఊరిలోనికి రావద్దంటే గుడ్డి నెక్కడకట్టుట అనియడిగినాఁడట** — ఆంధ్రలోకోక్తి

**ఊరిలో పెండ్లి ఊరి కుక్కల కడావడి** — ఆంధ్రలోకోక్తి

**ఊరు ఉస్తికాయంతగాని, సిద్ధాంతములు, వచనములు తాటికాయలంత** — ఆంధ్రలోకోక్తి

**ఊరికంతా ఒకర్తే భోగంది ఎవరికది ఉంపుడుకత్తెయగును?** — ఆంధ్రలోకోక్తి

**ఊర్మైతె ఊరంత చందాపడినా కరణమ్మైతె కాసైనా పడదు** — అనగా కరణము ఆదరివద్దా దంఖతాడు కాని తానివ్వడని భావము ఆంధ్రలోకోక్తి

**ఊరి బిడ్డలను రాజుకొడితే రాజు బిడ్డలను దేవుఁడు కొట్టును** — ఆంధ్రలోకోక్తి

**ఊర్మిళాదేవి** — జనకమహారాజున (విదేహదేశాధీశుడు) కీమె ఔరసపుత్రిక. సీతాదేవికిసోదరియు, తోటికోడలు నగుచు శ్రీరామసోదరుఁ డగు లక్ష్మణుని భార్య. శ్రీరాముఁ డరణ్యవాసమున కేగుతరి, ఊర్మిళాదేవి భర్తయగు లక్ష్మణుఁడు వెంటాడ వాగు తిరుగ నయోధ్య కరుదెంచకయు, నీమె యుత్తర వ్యాపారముల కాటి పక నిదించుచుండెననియు నక్కాలము లక్ష్మణుడు నిద నెఱుఁగకుండె ననియు జెప్పఁబడినది. మఱియు నిటుల లక్ష్మణుఁడు నిదుర మానియుంట, నాతనిచే నింద్రజిత్తు మరణింపఁ గారణమాయెననియుంగూడ చెప్పఁబడినది (ఇంద్రజిత్తు చూడుఁడు). యముని భార్యలలో నొక ఊర్మిళాదేవియుం గలదు.

**ఊరు పొమ్మంటే కాడు రమ్మంటుంది** — (కాడు = శ్మశానము) ఆంధ్రలోకోక్తి

**ఊరువిడచి పొరుగూరికిపోయినా కర్మము గాళ్లంటుకుని వచ్చును గాని వదలదు** — ఆంధ్రలోకోక్తి

**ఊర్ములు ఆరు** — షడూర్ములు చూడుము

**ఊలజీ** (Oology) — పక్షుల యొక్కయు, పక్షుల గ్రుడ్లయొక్కయు పరిశోధక విధానము

**ఊషరవృష్టిన్యాయము** — చవిటి పఱ్ఱ (భూప్రదేశము) పై వర్షించుటయని యర్థము. నిరర్థకము ఉపయోగించుటకు వీలులేని ఉప కారమని భావము

**ఊషరక్షేత్ర బీజన్యాయము** — దీనిని ఊషరగవాపితబీజన్యాయమనియు నందురు. నిష్ఫలంబగు నూషరక్షేత్రమున (గొడ్డుభూమి యందు) నాటిన విత్తనములని భావము. ఊషర వృష్టి (ఎడారిలో కురిసిన వర్షము) న్యాయమును ఇట్టిభావమునే (నిరుపయోగమని) తెల్పును

**ఊహ** — ఊహ తలంపునకు తర్వాతకల్గు నవస్థ. ఇది మేదస్సు (మెదడు లేక బుద్ధి) యందుద్భవించునది. దీని నాంగ్లమున Brain అనెదరు. గాన పాశ్చాత్యులు మేదస్సునను, ప్రాగు డభ్యాసమున జెప్పరాదనియు, నిద్రమాని మెద డును బలహీనపర్చరాదనియు, అధికముగ దిని దానిని మొద్దుచేయరాదనియు పామెతగ వల్కు దురు. శరీరస్థములగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రి యాదు లన్నియు మెదడుకు లోబడినవి. ఊహా లకు యోచనలకు మెదడు జన్మస్థానము. తలంచున దేదియో జ్ఞప్తియుంచుకొనునదేదియో సరిగా ప్రాశ్చాత్యవిద్వాంసులుగ గ్రహింపకున్నను, ఏదియో యొకటి కలదనుచుందురు. తలంపునుండి యూహా వృద్ధియగునటగా నెన్నుదురు. మేదస్సు యొక్క పరిశుభ్రత, బలములనుండి యూహా లుండెడిని ఆలోచన రెంటి సముదాయము ఒకదాని యొక్కయు, తత్సంబంధస్థితిని గూర్చి యూహిం చినది యాలోచనము. నిద్రయం దీయూహాలు పలువిధములుగ నుండును. గాఢనిద్రయం దే యూహాలు లేక మెదడు విశ్రాంతి నందియుండును. పూర్తిగనుండని కలతనిద్రయందు కొంతవఱ కూహాలు కల్గించి బాధించుచుండుగాన నాయూ హాలు స్వప్నముల దశయందుపయోగించును

సంగీతపు పనిముట్లను వాయించునపుడే తప్ప తక్కిన కాలములందు కలుగనట్టుల, మెదడు గాఢ నిద్రయందు విశ్రాంతి గొనుచుండును. మెదడు కు విశ్రాంతియు బలము గల్గుచుండుటయు నత్యవసరములు గాన మానవశరీరమునందు, మెదడు చెడకుండ మానుకొనుచు ఊహాలు గల్గించుట కత్యవసరములు. దక్షిణదేశము లందగస్త్యసాంప్రదాయ వైద్యమున కొన్ని గ్రంథములు రచించిన ఊహాముని యొక వైద్య శాస్త్రవేత్త (అగస్త్యసాంప్రదాయ వైద్యము చూడుము)

**ఊహ ఉద్యోగానికి వ్రాతవాతకళ్యా ద్వదానికి, (గృహాచారం గాడిదలను కాయుదానికిఉండి లాగుతున్నట్లు** — ఆంధ్రలోకోక్తి

**ఊహాపోహన్యాయము** — ఊహ యనిన, ఒకదానియందు అడగియుండి పైకి తెలియం బడనిదానిని ఊహించుట. ఊహ లేనిదానిని ఉన్నదేమోనని అపోహ పడుట అపోహ. దూరాలోచనమని భావము.

**ఊహాముని** — కొన్ని యాయుర్వేద వైద్య గ్రంథములను రచించిన వాఁడు. అగస్త్య సాంప్రదాయ వైద్యవిధానవేత్త (అగస్త్యసాంప్ర దాయ వైద్యము చూడుము)

**ఊళ్లేలే కుమారునివద్ద కన్న ఉపా దానంచేసుకునే భర్తవద్దనే స్త్రీలన్న తంత్రం సాగడము** — ఆంధ్ర లోకోక్తి

